# అద్భుత లోకంలో ఆలీసు

**లూయిస్ కారోల్**

బొమ్మలు : సర్ జాన్ టెన్నియల్

**అనువాదం : డా॥ పద్మిని దివాకర్ల**

**డా॥ లలితా భాస్కర శర్మ**



**మంచి పుస్తకం**

ALICE'S ADVENTURES IN WONDERLAND by Lewis Carroll

**అద్భుత లోకంలో ఆలీసు - లూయిస్ కారోల్**


బొమ్మలు : సర్ జాన్ టెన్నియల్

అనువాదకులు : డా॥ పద్మిని దివాకర్ల, డా॥ లలితా భాస్కర శర్మ

సంపాదకత్వం : కె. సురేష్

ప్రచురణ : జూన్, 2013

ప్రతుల సంఖ్య : 1000

**వెల** : రూ. 60/-

**ISBN** : 978-93-80153-93-3

*ప్రచురణ, ప్రతులకు :*

**మంచి పుస్తకం**

12-13-450, వీధి నెం.1

తార్నాక, సికింద్రాబాదు 500 017

ఫోన్ : 94907 46614.

email : info@manchipustakam.in

website : www.manchipustakam.in

కంపోజింగ్, లే అవుట్ : పద్మ

**ముద్రణ :** చరిత ఇంప్రెషన్స్

1-9-1126/బి,

అజామాబాద్, హైదరాబాదు,

ఫోన్: 27678411.

# విషయ సూచిక

# కుందేలు కన్నంలో

అక్క పక్కన నదీ తీరాన కూర్చుని చేయటానికి ఏమీ లేకపోవడంతో ఆలీసుకి చాలా విసుగుగా ఉంది. అక్క చదువుతున్న పుస్తకంలోకి ఒకటి రెండుసార్లు తొంగి చూసింది. ఆ పుస్తకంలో బొమ్మలు, సంభాషణలు లేవు. 'బొమ్మలు, సంభాషణలు లేని పుస్తకం వల్ల ప్రయోజనం ఏమిటి?' అనుకుంది ఆలీసు.

అలసి విసుగెత్తిన ఆలీసు లేచి, తోటలోని పువ్వులను ఏరి పూలమాలగా గుచ్చుదామా అని ఆలోచిస్తూ ఉంది (ఎండగా ఉండడం వల్ల నిద్రవస్తూ, మెదడు మొద్దుబారి ఉండడం వల్ల ఆలోచనలు కూడా సరిగా రావడంలేదు). అలా ఆలోచిస్తూ ఉండగా ఒక ఎర్రటి కన్నుల, తెల్లని కుందేలు తన పక్కగా పరిగెత్తడం చూసింది.

అందులో ఆలీసుకి ఏమీ వింత అనిపించలేదు. ఆ కుందేలు "అయ్యో! అయ్యో! నాకు చాలా ఆలశ్యం అవుతోంది," అనడం వినిపించింది. అప్పటికి ఆశ్చర్యపడకున్నా, కుందేలు అలా మాట్లాడటమే కాక, కోటు జేబులోంచి గడియారంతీసి, చూసుకుని పరిగెత్తడం విచిత్రంగా అనిపించింది. అప్పటివరకు కుందేళ్లు కోటు వేసుకోవడంకానీ, దాని జేబులోంచి గడియారం తీయడంకానీ ఆలీసు చూడలేదు. దాంతో కుందేలు వెంట పరుగు పెట్టింది ఆలీసు. ఆ కుందేలు ఒక కన్నంలోకి దూరడం గమనించింది.

వెంటనే ఆలీసు కూడా కుందేలు కన్నంలోకి ప్రవేశించింది. మళ్లీ బయటకి రాగలనా అన్న సంశయం కూడా ఆమెకు కలగలేదు.

కుందేలు కన్నం ముందుకు వెళుతున్నకొద్దీ సొరంగంలాగా ఉంది. కొంత దూరం వెళ్లిన తరవాత సొరంగం కిందకి తిరిగింది. ఆగాలన్న ఆలోచన రావడానికి ముందే ఆలీసుకి ఒక లోతైన బావిలోకి పడిపోతున్నట్టు అనిపించింది.

ఆ గొయ్యి చాలా లోతుగా అన్నా ఉండి ఉండాలి, లేదా ఆమె చాలా



నిదానంగా అన్నా కింద పడుతూ ఉండి ఉండాలి. పడుతూ ఉన్నప్పుడు చుట్టూ పరికించి చూస్తూ, తరవాత ఏమి జరుగుతుందా అన్న ఆశ్చర్యంతో ఉంది ఆలీసు. ముందుగా కిందకు చూసింది, కాని ఆ గొయ్యి చీకటిగా ఉండడంతో కింద ఏం ఉందో తెలియలేదు. అప్పుడు పక్కలను పరిశీలించి చూస్తే ఆ గొయ్యి గోడలనిండా పుస్తకాలు పెట్టుకొనే అరలు ఉన్నాయి. కొయ్యమేకులకు తగిలించి ఉన్న చిత్రాలు, పటాలు కనిపించాయి. కిందకి జారుతూ ఉండగానే ఒక అరలోనుండి ఒక జాడీని తీసింది. దానిపై “మామిడి

తాంద్ర" అని రాసి ఉంది. సంతోషంగా మూత తీసిన ఆలీసు నిరాశ చెందింది – అది ఖాళీ జాడి. జాడీని జారవిడిస్తే కింద ఎవరికైనా ప్రమాదం సంభవించవచ్చునని కిందికి జారుతూనే మరో అరలో జాడీని పెట్టి గోతిలోకి నెమ్మదిగా జారసాగింది.

'ఇంత కిందకి జారిన తరవాత మెట్లమీదనుంచి కిందకి పడితే నాకు ఏమీ అనిపించదు! ఇంట్లో వాళ్లందరూ నా ధైర్యాన్ని చూసి ఆశ్చర్యపోతారు. అంతెందుకు ఇంటిమీదనుంచి కింద పడినా నేను ఏమీ అనను,' అనుకుంది ఆలీసు.

కిందకి, కిందకి, కిందకి పడుతూనే ఉంది. దీనికి అంతం అంటూ ఉండదా? 'ఇప్పటికి ఎన్ని మైళ్లు కిందకు పడి ఉంటానో?' పైకే అనుకుంది ఆలీసు. 'బహుశా భూమి కేంద్రాన్ని చేరుకుంటూ ఉండవచ్చు. అలాగైతే, నాలుగువేల మైళ్లు పడి ఉంటాను, కానీ – (ఇటువంటి విషయాలు బడిలో చాలా నేర్చుకుంది ఆలీసు. తన తెలివిని ప్రదర్శించడానికి అక్కడ ఎవరూ లేకపోయినా వాటిని మననం చేసుకోవడం ఆమెకు బాగుంది.) 'దూరం లెక్క తేలింది కానీ ఏ అక్షాంశ, రేఖాంశాల దగ్గర ఉన్నానో?' (అక్షాంశం అంటే ఏమిటో, రేఖాంశం అంటే ఏమిటో ఆలీసుకి ఏమీ తెలియదు. కానీ ఆ పదాలు అనుకోవడం బాగుంది.)

మళ్లీ తన ఆలోచనలను కొనసాగించింది. 'భూమి ఆవలివైపు వరకు పడిపోతే! అక్కడ మనుషులు తలలు కిందకు, కాళ్లు పైకి పెట్టి నడుస్తుంటారు! అక్కడి అపనాగరికులను–' (అది సరైన పదం కాదనిపించడంతో తన మాటలు వినడానికి అక్కడ ఎవ్వరూ లేకపోవడం ఈసారి ఆమెకు సంతోషంగా అనిపించింది.) '– ఆ దేశం ఏమిటో అడిగి తెలుసుకోవాలి. అమ్మగారు, దయచేసి ఇది న్యూజిల్యాండో, ఆస్ట్రేలియానో చెబుతారా?' (ఆమె మాటల్లో మర్యాదను వ్యక్తపరడానికి ప్రయత్నించింది. గాలిలోంచి కిందకి పడుతూ మర్యాదగా మాట్లాడడం మీరు చెయ్యగలరేమో ఊహించుకోండి.) 'అలా అడిగితే నన్ను ఏమీ తెలియని మొద్దుకింద జమకడతారు. కాబట్టి అది ఏ దేశమో ఎవరినీ అడగకూడదు. ఎక్కడన్నా రాసి ఉండి కనపడుతుందేమో చూడాలి.'

కిందకి, కిందకి, కిందకి. చేయడానికి ఇంకా ఏమీ లేకపోవడంతో ఆలీసు మళ్లీ ఆలోచించసాగింది.

'ఈ రాత్రికి నేను లేకపోతే డయానా నామీద బెంగపెట్టుకుంటుందేమో.' (డయానా అంటే ఆలీసు పెంపుడు పిల్లి.) 'నీకు ఎవరైనా పాలు పోస్తున్నారో లేదో. నువ్వు కూడా నాతో ఉంటే ఎంత బాగుండేది. ఇక్కడ గాలిలో ఎలుకలు లేవు. కానీ గబ్బిలాలను పట్టేదానివేమో. అవి కూడా ఎలుకలలాగా ఉంటాయి. అయినా పిల్లులు గబ్బిలాలను తింటాయా?' అలా అనుకుంటూ ఉండగా నిద్ర ముంచుకొచ్చినట్లయింది. ఆ నిద్రమత్తులోనే, కలలో మాదిరి 'పిల్లులు గబ్బిలాలను తింటాయా? పిల్లులు గబ్బిలాలను తింటాయా?' అని అనుకోసాగింది. ఒక్కొక్కసారి 'గబ్బిలాలు పిల్లులను తింటాయా?'* అని అడగసాగింది. ఆ రెండు ప్రశ్నలకూ ఆమె వద్ద సమాధానం లేదు కాబట్టి దానిని ఎలా అడిగినా ఒకటే. నిద్రపోతున్నట్లు, నిద్రలో కలగంటున్నట్లు, ఆ కలలో డయానాతో నడుస్తూ, "డయానా నిజం చెప్పు! నువ్వు ఎప్పుడైనా గబ్బిలాన్ని తిన్నావా?" అని అడిగినట్లు అనిపించింది. అంతలో ఆమె దభీమంటూ ఎండు ఆకుల మీద పడింది. దాంతో కింద పడడం అయిపోయింది.

అదృష్టవశాత్తు ఆలీసుకి ఎటువంటి దెబ్బలూ తగలలేదు. వెంటనే ఒక్క గెంతులో కాళ్లమీద నిలబడి పైకి చూడగా, చీకటిమయంగా కనిపించింది. కానీ ముందుకి పొడవాటి రహదారి, దానిచివర తెల్లకుందేలు పరిగెత్తుతున్నట్లు కనిపించింది. ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా ఆ కుందేలు వెంట పరిగెత్తసాగింది. మళ్లీ ఆ కుందేలు "అయ్యో నా చెవులు, మీసాలు. ఎంతో ఆలస్యమైపోతోంది!" అనడం వినపడింది. కుందేలు వెనకాలే ఆలీసు మలుపు తిరిగేసరికి తెల్ల కుందేలు అదృశ్యమై పోయింది. తేరిపార చూసేసరికి తాను ఒక పొడవైన, ఎత్తు తక్కువగా ఉన్న దేదీప్యమానమైన గదిలో ఉన్నట్లు గ్రహించింది.

---

* ఇంగ్లీషులో 'Do cats eat bats?' లోనూ, 'Do bats eat cats?' లోనూ ఒక్క అక్షరమే స్థానభ్రంశం చెందినా అర్థం తారుమారై పోతుంది.

గది చుట్టూ తలుపులున్నాయి. కానీ ఆ తలుపులన్నిటికీ తాళాలు వేసి ఉన్నాయి. అన్ని తలుపులనూ తోసి చూసింది. అన్నివైపులా పరిగెత్తి పరికించి అక్కడినుండి బయటపడేదెలాగా అని ఆందోళన పడసాగింది.

ఇంతలో ముక్కాలి బల్ల కనిపించింది. ఆ బల్ల పూర్తిగా గాజుతో చేసినది! దాని మీద ఒక చిన్న బంగారు తాళం చెవి తప్ప ఇంకేమీ లేవు. తలుపులకు ఉన్న తాళాలలో ఒకదానికి చెవి ఇదే అయి ఉంటుంది అనిపించింది. కానీ ఆ తాళం చెవి చాలా చిన్నదిగా అన్నా ఉంది, లేదా చాలా పెద్దదిగా అన్నా ఉంది. దానితో ఒక్క తలుపు కూడా తెరుచుకోలేదు. రెండవసారి గదిచుట్టూ తిరుగుతుండగా ఒకచోట అంతకు ముందు తాను చూడని ఒక తెర కనిపించింది. తెర తీసి చూస్తే ఒక చిన్న తలుపు కనిపించింది. ఆ తలుపుకి ఉన్న తాళానికి బంగారు తాళం చెవి సరిపోయింది. ఆలీసు ఆనందానికి అంతులేదు.



ఆ చిన్న తలుపు తీసి చూస్తే చిన్న ఎలుకలు కూడా దూరలేనంత దారి కనిపించింది. ఆ దారికి అటువైపున ఎవరూ ఎన్నడూ చూడనంతటి సుందరమైన ఉద్యానవనం కనిపించింది. ఆ గదిని వదిలి ఆ అందమైన తోటలోకి వెళ్లడానికి అలీసు విశ్వప్రయత్నం చేసింది. అందమైన రంగురంగుల పూలమధ్య, నీటి గుమ్మటాలమధ్య తిరగాలని ఎంతగానో అనిపించింది ఆలీసుకి. కానీ ఆ ద్వారం చాలా చిన్నది, తన తల కూడా పట్టదు. ఒకవేళ తల పట్టినా తన భుజాలు అస్సలు పట్టవు. 'టెలిస్కోపును మడిచి చిన్నగా చేసినట్లు నేను కూడా చిన్నగా అయితే ఎంత బాగుంటుంది,' అనుకుంది ఆలీసు. 'ఎలా మొదలుపెట్టాలో తెలిస్తే ఇది సాధ్యమే,' అని కూడా అనుకుంది. అప్పటివరకు జరిగిన విశేషాల దృష్ట్యా ఎటువంటి వింతలైనా జరగవచ్చు! ప్రయత్నం చేస్తే  అసాధ్యం అనేది ఉండదని ఆలీసు నమ్మసాగింది.

చిన్న తలుపు దగ్గర నిలబడి లాభంలేదు, ఆ గాజుబల్ల దగ్గర వెదికితే ఇంకొక తాళం చెవి దొరకవచ్చునేమో అన్న ఆశతో అక్కడికి వెళ్లింది అలీసు. లేదా మనుషుల్ని టెలిస్కోపు మాదిరి ఎలా మడవాలో తెలియచేసే పుస్తకం ఉంటుందనుకుంది. కానీ అంతకు ముందు అక్కడలేని ఒక సీసా ఆమెకు కనిపించింది. దానిమీద పెద్దపెద్ద అక్షరాలతో 'నన్ను తాగు' అన్న కాగితం అతికించి ఉండడం చూసింది.

'బాగుంది. 'నన్ను తాగు' అని రాసిఉన్నంతనే తాగేటంతటి తెలివితక్కువదాన్ని కాదు. ముందు జాగ్రత్తగా సీసాను పరిశీలిస్తాను, ఎక్కడైనా 'విషం' అని కాని రాసి ఉందేమొ,' అనుకుంది అలీసు. స్నేహితులు చెప్పిన మంచి మాటలు గుర్తుంచుకోని కారణంగా చాలామంది చిన్నపిల్లలు ప్రమాదకర పరిస్థితులలో చిక్కుకున్న కథలెన్నో చదివి ఉంది ఆలీసు.

ఎక్కడా 'విషం'అన్న సూచన కనపడలేదు. దాంతో రుచి చూసింది. అది చాలా రుచిగా ఉండడంతో సీసాలోనిదంతా తాగింది.

* * *

'చాలా వింతగా అనిపిస్తోంది,' అనుకుంది ఆలీసు. 'నేను టెలిస్కోపులాగా ముడుచుకు పోతున్నానేమో.'




నిజంగానే అలా జరిగింది! ఆమె ఇప్పుడు పది అంగుళాలే ఉంది. అందమైన తోటలోకి తీసుకువెళ్లే మార్గంలో పట్టేటంత చిన్నగా అయిపోయిందన్న ఊహతో ఆలీసు ముఖం వెలిగిపోయింది. ఇంకా చిన్నగా అవడంలేదని నిర్ధారించుకోడానికి కాసేపు ఆగింది. ఇంకా చిన్నగా అవుతుందేమోనన్న తలపు కొంచెం ఆందోళన కలిగించింది. 'కొవ్వొత్తిలాగా మొత్తం అయిపోతానేమొ. అప్పుడు నేను ఎలా ఉంటాను?' అనుకోసాగింది ఆలీసు. కొవ్వొత్తి ఆర్పేసిన తరవాత దాని మంట ఎలా ఉంటుందో ఊహించసాగింది. అటువంటి దృశ్యం అంతకు ముందెన్నడూ ఆమె చూడలేదు మరి.

ఇంకా చిన్నగా అవ్వడం లేదని నిశ్చయించుకుని తోటవైపు పయనించింది. తోట తలుపు దగ్గరకు చేరింది. తొందరలో తాళంచెవిని మరిచిపోయినట్లు అప్పుడు ఆలీసుకు గుర్తు వచ్చింది. వెంటనే తాళంచెవి కోసం బల్ల దగ్గరకు వెళ్లింది. అప్పుడు తెలిసింది అసలు సంగతి. ఆమె చిన్నగా మారడంతో బల్లమీది తాళంచెవిని చేరలేకపోయింది. పారదర్శకమైన

గాజు బల్లమీద ఉన్న తాళంచెవి స్పష్టంగా కనిపిస్తోంది. గాజుబల్ల కాలు పట్టుకుని నెమ్మదిగా ఎక్కడానికి ప్రయత్నించింది. కాని అది చాలా నునుపుగా ఉండడం వల్ల, పైకి పాకలేకపోయింది. ఏమీ చేయలేని ఆలీసు కింద కూర్చుని ఏడవడం మొదలుపెట్టింది.

కొంచెం సేపటికి ధైర్యాన్ని పుంజుకుని, ఏడుపుతో సాధించేది ఏమీ లేదని తెలుసుకుంది. కష్టసమయాలలోనే సహనం, తెలివితేటలూ ఉపయోగించాలని తనకు తాను చెప్పుకుంది. ధైర్యే సాహసే లక్ష్మీ! తనకు తాను సలహాలు ఇచ్చుకోవడంలో ఆలీసు చాలా దిట్ట (ఆ సలహాలను పాటించదన్నది వేరే విషయం). ఒక్కొక్కసారి కళ్లనీళ్లు వచ్చేటంతగా తనను తాను తిట్టుకునేది. తనతో తాను (తనను ఇద్దరు వ్యక్తులుగా భావించుకోవడం ఆలీసుకి ఎంతో ఇష్టం) ఆడుతున్న ఆటలో తనను తాను మోసం చేసినందుకు ఒకసారి తన చెవులను తానే పిండబోయిన సందర్భం ఆమెకు గుర్తుంది. 'ఇప్పుడు ఇద్దరు మనుషులులాగా నటించడం వల్ల లాభం లేదు,' అనుకుంది ఆలీసు. 'అసలు ఒక మనిషికి సరిపడేటంతే లేను.'

కొంచెంసేపటికి ఆమె చూపు గాజుబల్ల కింద ఉన్న చిన్న గాజుపెట్టె మీద పడింది. వెంటనే ఆ పెట్టెను తెరిచి చూసింది. అందులో ఆకర్షణీయమైన మిఠాయి కనిపించింది. ఆ మిఠాయిమీద 'నన్ను తిను' అన్న అందమైన అక్షరాలు ఉన్నాయి. 'మిఠాయి నన్ను పెద్దగా మార్చగలిగితే ఆ తాళం చెవి నాకు దొరుకుతుంది. అదే చిన్నగా మారితే తలుపు కిందనుంచి పాకి తోటలోకి ప్రవేశించగలను. ఏది ఏమైనా ఆ మిఠాయిని తిని చూస్తాను,' అని నిశ్చయించుకుంది ఆలీసు.

చిన్న ముక్కను తిని, ఆతృతతో తనలో పెరుగుదల ఏమైనా ఉందో లేదోనని తన శరీరాన్నంతా తడిమి చూసుకుంది. కాని తనలో ఏ మార్పూ కనపడకపోవడం ఆశ్చర్యంగా అనిపించింది. మామూలుగా మిఠాయితింటే ఏమీ కాదు. కానీ అసాధారణమైన ఘటనలకు ఆలీసు ఎంతగా అలవాటు పడిందంటే సాధారణ విషయాలు ఆమెకు చప్పగా అనిపిస్తున్నాయి.

అందుకని మిఠాయి అంతా పూర్తిగా తినేసింది.

***

# కన్నీటి మడుగు

'ఆశ్చర్యం! ఆశ్చర్యం! (ఎంత ఆశ్చర్యపోయిందంటే ఆ క్షణంలో సరైన తెలుగు ఎలా మాట్లాడాలో కూడా మరచిపోయింది.) నేనెన్నడూ ఊహించనంత పొడవుగా అయిపోతున్నాను. టాటా కాళ్లు!' అని చెప్పింది. (కిందకి చూస్తే తన కాళ్లు దూరంగా, దాదాపుగా కనపడకుండా పోయాయి.) 'టెలిస్కోపులాగా ఇలా పెరుగుతూ ఉంటే, పాపం నా కాళ్లకు మేజోళ్లు ఎవరు తొడుగుతారు? అవి చాలా దూరంలో ఉంటాయి కాబట్టి నా అంతట నేను తొడుక్కోలేను. అవి ఎలాగో నెట్టుకురావాలి,' అనుకుంది ఆలీసు. 'అవి నేను కావాలనుకున్నట్టుగా నడవవేమో! ప్రతి సంవత్సరం క్రిస్‌మస్‌కి వాటికి కొత్త బూట్లు బహుమతిగా ఇచ్చి చూస్తాను.'

ఆ బూట్లను తన కాళ్లకు ఎలా పంపించడమా అని ఆలోచించసాగింది. 'తన కాళ్లకి తనే బహుమతి పంపించడం ఎంత చిత్రంగా ఉంటుంది! చిరునామా కూడా వింతగా ఉంటుంది!

**ఆలీసు కుడి కాలు, చౌరాస్తా**

**జామతోట**

**కంచె దగ్గర**

**(ప్రేమతో ఆలీసు)**

ఏమిటి పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తున్నాను!'

ఆ సమయంలో ఆలీసు తలకు గది కప్పు కొట్టుకుంది. నిజానికి అలీసు ఇప్పుడు 9 అడుగులు పెరిగింది. వెంటనే బంగారు తాళంచెవిని తీసుకొని తోట ద్వారం వైపు పరిగెత్తింది.

పాపం ఆలీసు పక్కకు పడుకుంది, ఒంటి కంటితో ద్వారంగుండా చూసింది. కానీ ఎంత ప్రయత్నించినా ఆ తోటలోకి ప్రవేశించలేకపోయింది. నిస్సహాయురాలై ఏడవడం మొదలు పెట్టింది.

వెంటనే 'ఏడుస్తున్నందుకు నువ్వు సిగ్గు పడాలి. నీ అంతటి తెలివైన పిల్ల ఇలా కూర్చుని ఏడవడం అసందర్భంగా ఉంది,' అని తనను తాను



నిందించుకుంది. కానీ కన్నీటి ప్రవాహం మాత్రం ఆగలేదు. తీరా చూస్తే అక్కడ ఒక కన్నీటిమడుగు తయారయింది.

కాసేపటికి దూరాన ఎవరివో అడుగుల చప్పుడు వినబడడంతో తన కళ్లను తుడుచుకుని, వస్తున్నది ఎవరా అని చూసింది. అందమైన దుస్తులను ధరించిన తెల్ల కుందేలు వస్తోంది. ఒక చేతిలో తెల్లటి చేతితొడుగులు, మరొక చేతిలో విసనకర్ర ఉన్నాయి. ఆ కుందేలు 'మహారాణి! మహారాణి! వేచి ఉండేలా చేస్తే ఆమెకు పిచ్చికోపం వస్తుంది,' అని తనలో తాను అనుకుంటోంది. ఆలీసు ఎంత నిస్సహాయ స్థితిలో ఉందంటే ఎవరినైనా సహాయం అడగడానికి సిద్ధంగా ఉంది. అందుకే కుందేలు తన దగ్గరకు రాగానే పీరికి గొంతుకతో మెల్లగా, "అయ్యా, దయ ఉంచి –" అని అడగసాగింది. ఆ మాటలకు కుందేలు బెదురుకుని తెల్ల చేతి తొడుగులు, విసనకర్ర పడేసి వేగంగా పరిగెత్తుతూ చీకటిలోకి మాయమయ్యింది.

ఆలీసు ఆ చేతితొడుగులు, విసనకర్ర తీసుకుంది. ఆ గదిలో చాలా ఉక్కబోతగా ఉండడం వల్ల తనలో తాను మాట్లాడుకుంటున్నంతసేపు విసురుకుంటూనే ఉంది. 'అయ్యో, అయ్యో! ఈరోజు ప్రతిదీ వింతగా ఉందే!

నిన్న అన్నీ మామూలుగానే ఉన్నాయి. రాత్రికి రాత్రి నేనేమైనా మారి పోయానా? ఈ రోజు ఉదయం లేచినప్పుడు నేను నేనుగానే ఉన్నానా?



కొంత తేడాగా అనిపించినట్టు గుర్తుంది. నేను నేనుగా లేకపోతే నేను ఎవరిని అన్నది తరవాత ప్రశ్న. ఇది చాలా పెద్దచిక్కు సమస్య!' తన వయస్సు ఉన్న పిల్లలందరినీ గుర్తుకు తెచ్చుకుంటూ ఎవరిలా మారి ఉంటుందో తెలుసుకోడానికి ప్రయత్నించసాగింది.

'అనితనైతేకాను,' అనుకుంది ఆలీసు. 'ఆమె జుట్టు వంకీలు, వంకీలుగా ఉంటుంది, నా జుట్టు ఏమాత్రం వంకులుగా ఉండదు. నేను మాలతిగా కూడా మారలేదని కచ్చితంగా చెప్పగలను. నాకు అన్ని విషయాలు తెలుసు, కానీ మాలతికి ఏమీ తెలియదు. అదీకాక ఆమె ఆమెనే, నేను నేనే

– అయ్యో, ఇదంతా ఎంత గందరగోళంగా ఉంది! ఇంతకు ముందు నాకు తెలిసిన విషయాలన్నీ ఇంకా తెలుసో లేదో చూస్తాను. నాలుగు అయిదుల పన్నెండు, నాలుగు ఆరుల పదమూడు, నాలుగు ఏడుల – అయ్యో! ఇలాగైతే నేనెప్పటికీ ఇరవైకి చేరుకోలేను. అదీకాక ఎక్కాలు ఏ విషయమూ తెలియచేయవు – భౌగోళికశాస్త్రం చూద్దాం.. పారిస్ రాజధాని లండను, రోము రాజధాని పారిస్, రోమ్ నగరమేమో – ఇదంతా తప్పని కచ్చితంగా చెప్పగలను! మాలతిగా మారిపోయానా ఏమిటి! 'చిన్నారి మొసలి' – చెప్పి చూస్తాను,' అంటూ బడిలో పాఠం అప్పజెప్పే పిల్లమాదిరి చేతులు కట్టుకుని నిలబడింది. ఆ పాట చెప్పబోయేసరికి ఆమె గొంతు వింతగా, బొంగురుగా మారిపోయింది. పదాలు కూడా రావలసినట్లు రాలేదు:

*'చిన్నారి మొసలి ఎలా*
*తన తోకకు మెరుగు పెడుతుంది?*
*నైలు నదీజలాలను ఎలా*
*ప్రతి పొలుసు మీదకు పోస్తుంది?*

*'ముఖం నవ్వుతున్నట్టు పెట్టు,*
*ఎడంగా పెట్టు కాళ్లు,*
*తెరచి ఉంచును దవడలు,*
*తెలియక వచ్చిన చేపలను పట్టు!'*

'పదాలన్నీ తప్పుగా వచ్చాయని నాకు తెలుసు, నేను నిజంగానే మాలతిలాగా మారిపోయినట్టున్నాను. అంటే నేను ఇకనుంచి ఆ చిన్న ఇంట్లో ఉండాలి. ఆడుకోడానికి బొమ్మలు అంతగా ఉండవు. పైగా చాలా పాఠాలు చదవాలి. నేను మాలతిగా మారిపోయి ఉంటే నేను ఇక్కడే ఉండిపోతాను. ఎవరైనా తలకిందకి పెట్టి 'పైకిరా అమ్మాయి!' అంటే నేను పైకి చూసి, 'నేను ఎవరిని? ముందు ఆ విషయం చెప్పండి. ఆ వ్యక్తిగా ఉండడానికి నాకు ఇష్టమైతేనే నేను పైకి వస్తాను,' అని బదులిస్తాను,' అనుకుంది ఆలీసు. 'ఎవరైనా కిందకి చూస్తే బాగుండును. ఒక్కదానినే ఉండడం చాలా విసుగ్గా

ఉంది,' అంటూ ఆలీసు మళ్లీ భోరున ఏడ్చింది. ఇంతలో తన చేతులను చూడగా, కుందేలు చేతి తొడుగు తన చేతికి తొడిగి ఉండడం గమనించి ఆశ్చర్యపోయింది. 'ఇదెలా సాధ్యం?' అని ప్రశ్నించుకుంది. 'తాను మళ్లీ చిన్నగా మారి ఉండాలి.' దగ్గరలో ఉన్న బల్ల దగ్గరకు వెళ్లి తనను తాను కొలుచుకుంది. ఆమె ఎత్తు ఇప్పుడు రెండు అడుగులే ఉంటుందని ఊహించింది. తను ఇంకా చిన్నగా అయిపోతున్నానని, అలా చిన్నగా అయిపోడానికి విసనకర్ర కారణమని ఊహించింది ఆలీసు. వెంటనే మరింత చిన్నగా కాకుండా ఉండడానికి చేతిలోని విసనకర్ర కింద పడేసింది.

'కొంచెంలో తప్పించుకున్నాను!' అనుకుంది ఆలీసు. జరుగుతున్న పరిణామాలతో ఆమె చాలా భయపడిపోయింది కానీ భూమ్మీద ఇంకా ఉన్నందుకు సంతోషించింది. 'ఇప్పుడు తోటలోకి!' అనుకుంటూ చిన్న తలుపు వైపుకి పరిగెత్తింది. అయ్యో! చిన్న తలుపు మూసేసి ఉంది. దాని బంగారు తాళంచెవి ఎప్పటిమాదిరిగా గాజు బల్లమీద ఉంది! 'పరిస్థితులు ఇంతగా ఎప్పుడూ విషమించలేదు,' అనుకుంది ఆలీసు. 'ఇంత చిన్నగా నేను ఎప్పుడూ లేను. ఇదేం బాగాలేదు.'

ఇలా అనుకుంటూ ఉండగా, ఆలీసు దభాలున జారి నీటిలో పడిపోయింది. పాపం! ఉప్పునీటి మడుగులో తన గెడ్డం వరకు మునిగి ఉంది. ముందుగా సముద్రంలో పడిపోయాననుకుంది. 'అలాగైతే రైలెక్కి వెనక్కి వెళ్లవచ్చు,' అనుకుంది ఆలీసు. (ఆలీసు అప్పటివరకు సముద్రతీరానికి ఒక్కసారే వెళ్లింది. సముద్ర తీరంలో స్నానంచేసే పెద్దవాళ్లు, ఇసుకలో పిచ్చుకగూళ్లు కట్టుకునే పిల్లలు, ఆ తరవాత వరసలో యాత్రికులు బస చేసే ఇళ్లు, వాటి వెనక రైల్వేస్టేషను ఉంటాయన్నది ఆలీసు అభిప్రాయం.) కానీ అది తాను తొమ్మిది అడుగుల ఎత్తు ఉన్నప్పుడు కార్చిన కన్నీటి మడుగు అని వెంటనే తెలుసుకుంది.

'నేనంతగా ఏడవకుండా ఉండాల్సింది!' బయటికి దారికోసం ఈదుతూ అనుకోసాగింది ఆలీసు. 'అందుకు శిక్షగా నా కన్నీటిలో నేనే మునిగిపోతానేమో. ఇది చాలా వింతైన విషయమవుతుంది! ఈ రోజు ప్రతిదీ వింతగానే ఉంది.'



ఇంతలో ఆ మడుగులో ఏదో ఈదుతున్న శబ్దం వినిపించింది. అది ఏమిటో తెలుసుకుందామని దాని దగ్గరకు ఈదుకుంటూ వెళ్లింది. ముందు అది నీటి గుర్రమో, మరో పెద్ద జంతువో అయి ఉంటుందనుకుంది. తరవాత తను ఎంత చిన్నగా ఉందో గుర్తుకు రావడంతో అది తనలాగే నీటిలో జారిపడిన ఎలుక అని తెలుసుకుంది.

'ఈ ఎలుకతో మాట్లాడి ఏమైనా ప్రయోజనం ఉంటుందా,' అనుకుంది ఆలీసు. 'అయినా ఇక్కడ ఏమైనా జరగవచ్చు! బహుశః అది మాట్లాడ గలదేమో! ప్రయత్నించి చూస్తే నష్టం లేదుకదా,' అనుకుని ఆ ఎలుక దగ్గరకు వెళ్లి "ఓ ఎలుకా! నీకు ఈ నీటి మడుగు నుండి బయటపడే మార్గం తెలుసా! నాకు మాత్రం ఇంక ఈతకొట్టే ఓపికలేదు," అంది ఆలీసు. దానికి సమాధానంగా ఆ ఎలుక ఆసక్తిగా ఆలీసుని చూసింది. కన్ను గీటింది అనిపించింది కాని మాటమాత్రం మాట్లాడలేదు.

'ఆ ఎలుకకు ఇంగ్లీషు రాదేమొ.' అనుకుంది ఆలీసు. 'దండెత్తి వచ్చిన ఫ్రెంచి రాజు విలియంతోపాటు వచ్చిన ఎలుకేమో అది.' (చరిత్ర కొంచెం

తెలిసినప్పటికీ ఏది ఎంత కాలం క్రితం జరిగిందో ఆలీసుకి స్పష్టంగా తెలియదు.) దాంతో తన ఫ్రెంచి పుస్తకంలో మొదటి వాక్యమైన 'నువ్వు పిల్లివా?' అంది. దాంతో ఎలుక నీటినుంచి ఒక్కసారిగా బయటకు దూకి భయంతో వణుకుతున్నట్టు అనిపించింది. దానికి భయం కలిగించినందుకు బాధపడుతూ, "నీకు పిల్లులంటే ఇష్టంలేదన్న సంగతి మరిచిపోయాను," అంది ఆలీసు.

"పిల్లులంటే ఇష్టంలేదా అంటున్నావా! నువ్వు ఎలుకవైతే నీకు పిల్లులంటే ఇష్టం ఉంటుందా?" అంది ఎలుక.

"ఇష్టం ఉండకపోవచ్చు," మెల్లగా అంది ఆలీసు. "కానీ కోప్పడకు. నా పిల్లి డయానాను చూస్తే నువ్వు తప్పకుండా పిల్లులంటే ఇష్టపడతావు."



"అది ఎంత మంచి పిల్లో." బద్ధకంగా నీటిలో ఈదుతూ సగం తనకి తాను చెప్పుకుంటున్నట్టుగా చెప్పుకుంటూ వెళుతోంది ఆలీసు. "మంట దగ్గర మ్యావ్, మ్యావ్‌మంటూ చక్కగా కూర్చుంటుంది. దానిని ముద్దు చేయడం ఎంతో బాగుంటుంది. ఎలుకలను పట్టుకోవడంలో దానిని మించింది లేదు – అయ్యో, నన్ను క్షమించు." పాపం ఆ ఎలుక ఎంతగానో భయపడి పోయింది. అది గమనించిన ఆలీసు, "నీకు ఇష్టం లేకపోతే పిల్లుల గురించి

మాట్లాడుకోవద్దులే," అంది. తోక వరకు వణుకుతూ ఉన్న ఎలుక, "ఆ విషయం గురించి నేనసలు మాట్లాడనే మాట్లాడను. మా కుటుంబమంతటికీ పిల్లులంటే ద్వేషం: వాటంతటి నీచ, పనికిమాలిన, దరిద్రపుగొట్టు జంతువు మరొకటి లేదు! దాని పేరు మళ్లీ నా చెవిన పడనివ్వకు!"

"సరేలే!" సంభాషణను వేరే విషయం మీదకి మారుస్తూ అంది ఆలీసు. "పోనీ నీకు... నీకు... కుక్కలంటే ఇష్టమేనా?" అని అడిగింది. ఎలుక సమాధానం ఇవ్వలేదు.

"మా ఇంటి దగ్గర ఒక మంచి కుక్క ఉంది," అంటూ ఆత్రుతగా చెప్పసాగింది ఆలీసు. "అది ఎంత మంచి కుక్కో చూస్తే నీకే తెలుస్తుంది. దాని కళ్లు మెరుస్తూ ఉంటాయి. గోధుమ రంగు జుట్టు జులపాలు మాదిరి ఉంటుంది. ఏదైనా వస్తువు విసిరేస్తే తిరిగి తెచ్చిపెడుతుంది. వెనక కాళ్లమీద కూర్చుని అన్నం పెట్టమని అడుగుతుంది. ఎన్ని చేష్టలు చేస్తుందో, నాకు సగం కూడా గుర్తులేవు. దాని యజమాని ఒక రైతు. దాని విలువను డబ్బుల్లో లెక్కగట్టలేం అంటాడు అతను. పొలంలోని ఎలుకలన్నింటినీ అది చంపేస్తుందంట... అయ్యో! మళ్లీ ఎలుక మనసు నొప్పించినట్టు ఉన్నాను," విచారంగా  అంది ఆలీసు. ఎలుక ఎక్కడాలేని సత్తువ తెచ్చుకొని ఆలీసుకు ఎంత దూరంగా ఉంటే అంత మంచిదని ఈదుకుంటూ పోసాగింది.

తను చేసిన తప్పును గ్రహించిన ఆలీసు "ఓ ఎలుక మిత్రమా! పొరపాటు జరిగింది. తిరిగి రా. ఇక నేను పిల్లుల గురించి, కుక్కల గురించి మాట్లాడను," అంది. దాంతో ఎలుక ఆలీసు వైపుకి ఈదుకుంటూ వస్తోంది. దాని ముఖం పాలిపోయి ఉంది. "మనం ముందు ఈ మడుగునుండి బయటకు చేరుకోవాలి. ఒడ్డుకి చేరిన తరవాత నా కథ చెబుతాను. అప్పుడు నీకు అర్థం అవుతుంది, నాకు పిల్లులంటే, కుక్కలంటే ఎందుకు భయమో," అంది.

ఇంతలో ఆ మడుగులోకి చాలా జంతువులు, పక్షులు చేరి పెద్ద సమూహంగా మారడం గమనించింది ఆలీసు. అందులో బాతు, డోడో, లోరీ, డేగ, ఆశ్చర్యకరమైన ఇతర జంతువులు ఉన్నాయి. ఆలీసు దారి చూపగా అవన్నీ ఒడ్డుకు చేరుకున్నాయి.

# పరుగుల పందెం - పెద్ద కథ

వింతగా ఉన్న జంతువులన్నీ ఒడ్డుకు చేరాయి. కొన్ని పక్షులు తడిసి, ముర్రికైన వెంట్రుకలతో, కొన్ని జంతువులు వాటి జూలు తడిసి, నీరు కారుతూ చర్మానికి దగ్గరగా అతుక్కుపోయి, చూడ్డానికి చాలా చిరాకుగా, ఇబ్బంది పడుతున్నట్లుగా ఉన్నాయి.

తమ శరీరాల్ని ఎలా ఆరబెట్టుకోవాలి అన్నది వాటి మొదటి ప్రశ్న. దీని గురించి అవి తమలోతాము కొంచెంసేపు మాట్లాడుకున్నాయి. వాళ్లందరితో చాలా కాలంనుండి పరిచయం ఉన్నట్లు ఆలీసు మాట్లాడటం మొదలు పెట్టింది. ఆలీసు, లోరి చాలాసేపు వాదించుకున్నారు. ఆఖరికి లోరి ముఖం ముడుచుకొని, “నేను నీకంటే వయస్సులో పెద్దదానిని. అందుకని నీకంటే నాకు బాగా తెలియాలి,” అని అంది. కాని ఆలీసు దీనికి ఒప్పుకోకుండా, “నీ వయస్సు ఎంతో చెబితేనే గాని కుదరదు,” అంది. కానీ లోరి తన వయస్సు చెప్పడానికి సిద్ధపడలేదు.

ఆఖరికి ఎలుక అందరినీ కూర్చోమని దబాయించి తన మాటలు వినమంది, త్వరగా తడారిపోయే మార్గం చెబుతానంది. దాంతో అందరూ ఎలుక చుట్టూ గుండ్రంగా కూర్చున్నారు. తన శరీరాన్ని త్వరగా ఆరబెట్టుకోకపోతే జలుబు చేస్తుందేమోనని భయపడింది ఆలీసు.

“ఊ! నేను చెప్పేది వినేందుకు అందరూ సిద్ధంగా ఉన్నారు కదా,” అంటూ మొదలుపెట్టింది ఎలుక. “అందరూ నిశ్శబ్దంగా ఉండాలి. అన్నిటికంటే పొడిబారిన* సంగతి చెబుతాను. విలియం విజేత. అతడి

---

* Alice's Adventures in Wonderland కథనంలోని సగం హాస్యం ఇంగ్లీషు భాషపై ఆధారపడింది. ఒకే పదానికి వేరు వేరు అర్థాలు ఉండడాన్ని, వేరు వేరు స్పెల్లింగులు ఉన్న పదాలకు ఒకే ఉచ్చారణ ఉండడాన్ని ఆధారంగా చేసుకుని రచయిత పదాల గారడీ చేశారు. ఇక్కడ ఎలుక dry story చెబుతాను అంటోంది; dry అన్న పదానికి తడి ఆరబెట్టడం అన్న అర్థంతోపాటు dry story అన్నప్పుడు ఏమాత్రం ఆసక్తి కలిగించని, చప్పగా ఉండే కథ అన్న అర్థం కూడా ఉంది. తడిసిన జంతువులు తమ బట్టలు, ఒంటిని ఆరబెట్టుకోడానికి చప్పగా ఉండే కథ చెబుతోంది ఎలుక.

ఆశయాలు పోప్‌కు నచ్చాయి. ఆంగ్ల ప్రభుత్వానికి నాయకులు అవసరం అవ్వడంవల్ల విలియమ్‌ని ప్రతిపాదించారు. అందులో ఎడ్విన్, మోర్‌కార్, మర్సియా, నార్తుంబ్రియా రాజ ప్రముఖులు ...”

“అయ్యో!” అంటూ లోరీ చలితో వణకడం మొదలుపెట్టింది.

దాంతో ఎలుకకి కోపం వచ్చింది. కోపం కనపడనివ్వకుండా నమ్రతగా “మీరు గాని ఏమైనా అన్నారా?” అని ప్రశ్నించింది.

వెంటనే “అబ్బే, నేను మాట్లాడలేదే!” అంది లోరి.

“అలాగా, నువ్వు మాట్లాడావనుకున్నాను. అయితే సరే. నేను పూర్తిచేస్తాను,” అంటూ ఎలుక మళ్లీ ప్రారంభించింది. “ఎడ్విన్, కాంటర్‌బరీ ఆర్చిబిషప్ అయిన స్టిగాండు కూడా సమంజసమని గుర్తించారు.”

“ఏమిటి గుర్తించారు?” అంది బాతు. “అదే గుర్తించారు,” అంది చిరాకుగా ఎలుక, “ ‘అది’ అంటే ఏమిటో నీకు తెలుసు.”

దానికి బాతు సమాధానంగా “ ‘అది’ అంటే ఏమిటో నాకు బాగా తెలుసు. నాకు ఏదైనా దొరికినప్పుడు అది కప్ప, లేక ఒక పురుగు అవుతుంది. ఆర్చిబిషప్ గారు దేనిని గుర్తించారని అడిగాను.”

ఎలుక ఈ ప్రశ్నను వినకుండా తన ధోరణిలో హడావిడిగా “విలియంని రాజుగా చేయటం తమకు ఇష్టమేనని చెప్పటానికి ఎథిలింగుతో కలిసి ఎడ్గార్ వెళ్లాలి. విలియంని కలుసుకొని కిరీటం ఇస్తామని చెప్పాలి,” అని చెప్పుకుంటూ వెళ్లింది. “విలియం ప్రవర్తన మొదట్లో సమంజసంగానే ఉండేది కాని అతని సహాయకుల ప్రవర్తన... ఎలా ఉన్నావమ్మా నువ్వు?” అంటూ ఆలీసు వైపుకి తిరిగింది ఎలుక.

ఆలీసు విచారంగా “నా తల తడి ఏమాత్రం ఆరలేదు,” అని చెప్పింది.

“ఈ పరిస్థితుల్లో మనకు మంచి ఉపాయం తోచేవరకు నేటి సభను వాయిదా వేద్దాం,” అంటూ లేచింది డోడో.

“అర్థం అయ్యేటట్లు మాట్లాడు,” అంది డేగ. “నువ్వు చెప్పినదాంట్లో సగం కూడా నాకు అర్థం కాలేదు. నీకు కూడా అర్థం అయిందనుకోను,”

అంటూ ఎవరికీ కనపడకుండా వంగి నవ్వుకుంది డేగ. కానీ మిగిలిన పక్షులు వినపడేటట్టు నవ్వాయి.

"మన శరీరాల తడి ఆరడానికి మార్గం పరుగుల పందాలే," కోపగించుకుంటూ అంది డోడో.

తనకి అంతగా తెలుసుకోవాలని లేకపోయినా డోడో మాటలకు ఇంకెవరూ స్పందించకపోవటంతో "పరుగుల పందెం అంటే ఏంటి?" అంది ఆలీసు.

"పరుగుల పందెం అంటే ఏంటో చెప్పడం కంటే చేస్తే బాగా అర్థం అయిపోతుంది," అని డోడో చెప్పింది.

డోడో ఒక పెద్ద గుండ్రం గీసింది. "ఆకారం గురించి పట్టించుకోవద్దు," అంది. ఎవరికి నచ్చిన చోట వారిని నించోమంది. ఒకటి, రెండు, మూడు... అనగానే వాళ్లందరూ ఒక క్రమపద్ధతిలో కాకుండా ఎవరికి ఇష్టం వచ్చినట్లు వాళ్లు పరిగెత్తుతున్నారు. ఇష్టం లేనప్పుడు పందెంలో నుండి బయటకి వచ్చేస్తున్నారు. ఇలా ఆడడం వల్ల పందెం ఎప్పుడు ప్రారంభం అయింది, ఎప్పుడు సమాప్తమయింది ఎవరికీ తెలియలేదు. అర్థగంట పరుగు పందెం ఆటతో వాళ్లందరి తడి ఆరిపోయింది. అకస్మాత్తుగా "పందెం అయిపోయింది!" అంది డోడో. "ఎవరు గెలిచారు?" అన్నారు డోడో చుట్టూ చేరిన వాళ్లంతా.

చాలా సేపు ఆలోచిస్తేనే గాని జవాబు చెప్పలేకపోయింది డోడో. అందరూ నిశ్శబ్దంగా డోడో జవాబు కోసం ఎదురు చూశారు. ఆఖరికి "అందరూ గెలిచారు కాబట్టి అందరికీ బహుమానాలివ్వాలి," అంది డోడో.

"అయితే బహుమానాలు ఎవరు ఇస్తారు?" అని అన్నారు అందరూ ఏక కంఠంగా.

"అదేం ప్రశ్న. ఆమె ఇస్తుంది," అంటూ ఆలీసుని చూపించడంతో అందరూ ఆలీసు చుట్టూ చేరి "బహుమానాలు, బహుమానాలు!" అంటూ అరవడం మొదలుపెట్టారు.

ఆలీసుకి ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఏదో ఒకటి చేయాలి కదా అని తన జేబులో చేయి పెట్టింది. అదృష్టవశాత్తు ఒక నిమ్మతొనల డబ్బా దొరకడంతో, ప్రతి ఒక్కరికి బహుమానంగా ఒక్కొక్కటి పంచిపెట్టింది. అవి సరిగ్గా సరిపోయాయి.

"ఆలీసు కూడా బహుమానం తీసుకోవాలి," అంది ఎలుక.

"తప్పకుండాను," అంది డోడో. "ఇంకా ఏం ఉన్నాయి నీ జేబులో?" అంటూ డోడో ఆలీసు వైపుకి తిరిగింది.

"ఒక ఉంగరం మాత్రమే," విచారంగా అంది ఆలీసు.

"అది నాకిటు ఇయ్యి," అంది డోడో.

ఉంగరాన్ని తీసుకొని డోడో ఆలీసుకు ప్రత్యేక బహుమానంగా



అందరిముందూ బహూకరించింది. అందరూ సంతోషంతో చప్పట్లు కొట్టారు.

ఆలీసుకి ఇదంతా అసందర్భంగా అనిపించింది. కాని వాళ్లందరిని చూస్తే నవ్వేందుకు భయపడి చెప్పేందుకు ఏం లేకపోవడం వల్ల నిశ్శబ్దంగా బహుమానాన్ని తీసుకుంది.

తరవాత అంతా ఆలీసు ఇచ్చిన నిమ్మతొనలు తినటం మొదలు పెట్టారు. అంతా గోలగా తయారయింది. చిన్న పక్షులకి గొంతులో అడ్డుపడడం, పెద్ద పక్షులకు రుచి తెలియకపోవడం వల్ల అంతా అయోమయంగా తయారయింది. అందరు ఎలుక చుట్టూ గుండ్రంగా కూర్చుని ఇంకేమైనా చెప్పమని కోరారు.

"నీ కథ* అంతా చెపుతానన్నావు నాకు. గుర్తుందా?" అంది ఆలీసు. "మరి నువ్వు 'పి...'ని, 'కు...'ని ఎందుకు అసహ్యించుకుంటావో చెప్పు," ఎలుకకు కోపం వస్తుందేమోనని భయపడుతూనే అంది నెమ్మదిగా.



* ఇంగ్లీషులో ఒకే ఉచ్చారణ ఉన్న tale అంటే కథ అనీ, tail అంటే తోక అనీ అర్థం. అందుకే ఆ కథ కూడా తోక ఆకారంలో ఉంది.

"నా కథ చాలా పెద్దది; విచారకరమయినదీను," అంది ఎలుక.

"నీ తోక* చాలా పెద్దదే, కాని విచారకరమైంది అని ఎందుకు అంటావు?" ఎలుకవైపు చూస్తూ అడిగింది ఆలీసు. ఎలుక తన కథ చెపుతూ ఉంటే ఆశ్చర్యంగా తోకవైపు చూస్తూ కూర్చుంది ఆలీసు:

"ఊరకుక్క ఒకటి
ఇంటిలోన ఎలకతో
'ఇంటికడ పనిలేదు,
దమ్మిడీ ఆదాయం
లేదు. నిన్ను
కోర్టుకీడుస్తాను,
నీమీద దావా
వేస్తాను.'
'న్యాయవాదులు,
న్యాయమూర్తి
లేకుండా
విచారణ ఎలా,
మన సమయం
వృధాకదా,'
అడిగింది
ఎలుక. "నేనే
న్యాయవాదిని,
న్యాయమూర్తిని నేనే.
నేనే తీర్పు
చెబుతా,
నీకు
మరణ
శిక్ష
విధిస్తా."

"నువ్వు ఏం వినడం లేదు, ఏంటి ఆలోచిస్తున్నావు?" అని ఆలీసుతో అంది ఎలుక.

"నేను వింటున్నాను! నువ్వు అయిదవ మలుపు దగ్గర ఉన్నావు," అంది ఆలీసు.

"ఏం కాదు*," అంది ఎలుక కోపంగా.

దానికి ఆలీసు "ముడిపడిందా*? నేను విడదీయడానికి సహాయం చేస్తాను," అంది.

"నువ్వేం చెయ్యనక్కరలేదు," అంటూ కోపంగా లేచి వెళ్లిపోయింది ఎలుక. "అర్థం లేకుండా మాట్లాడుతూ నన్నెప్పుడూ పరిహాసం చేస్తూన్నావు."

"నేను ఆ ఉద్దేశంతో అనలేదు, నన్ను క్షమించవూ!" అంది ఆలీసు. "కాని నీకు ఇట్టే కోపం వస్తుంది తెలుసా!"

ఎలుక ఏం జవాబు చెప్పలేదు.

కథ పూర్తి చెయ్యమని ఎలుకను కోరింది ఆలీసు. ఆలీసుతో కలిసి మిగిలిన జంతువులన్నీ కూడా అడిగాయి. కాని ఎలుక చెప్పనని తల ఊపుకుంటూ ఒకింత వేగంగా వెళ్లిపోయింది.

ఎలుక వెళ్లిపోవడంతో విచారించింది లోరి. ఇదే సందర్భం అనుకుని ఒక తల్లి పీత పిల్లపీతతో అంది: "చూశావా కోపం ఎంత చేటో." "నువ్వు ఊరుకో," అంది పిల్లపీత కోపంగా. "నువ్వు ఆల్చిప్పకే కోపం తెప్పించగలవు."

"డయానా ఇక్కడ ఉంటే ఎంత బాగుండేది," అంది ఆలీసు ఎవరినీ ఉద్దేశించకుండా. "ఇక్కడ ఉన్నట్లయితే ఎలుకని క్షణంలో వెనక్కి తెచ్చేది."

లోరి ధైర్యం చేసి 'డయానా' ఎవరని అడిగింది.

"అది నా పెంపుడు పిల్లి. అది ఎలుకల్ని ఎంతో వేగంగా పడుతుంది. పక్షులనయితే ఇంక చెప్పనవసరంలేదు. చిన్న పక్షి పిల్లలనయితే ఇట్టే తినేయగలదు," అంది ఆలీసు.

---

* ఇంగ్లీషులో ఒకే ఉచ్చారణ ఉన్న not అంటే కాదు అనీ, knot అంటే చిక్కుముడి అనీ అర్థం.

అక్కడ ఉన్న జంతువుల్లో ఈ మాటలు కొంచెం అలజడి రేకెత్తించాయి. కొన్ని పక్షులు వెంటనే వెళ్లిపోయాయి. ఇక ముసలి కాకి ప్రయాణానికి సిద్ధమవుతూ "నేను త్వరగా ఇల్లు చేరాలి లేకపోతే నాకు గొంతునొప్పి వస్తుంది," అంది. ఇంకొక చిలక పిల్లల్ని పిలిచి "చాలా ఆలస్యం అయింది. మీరు వెళ్లి పడుకోండి," అంది. అలా ఒకరొకరుగా అక్కడ ఉన్న వాళ్లంతా ఆలీసును ఒంటరిగా వదిలి వెళ్లిపోయారు.

'అయ్యో! దయానా గురించి చెప్పకుండా ఉండాల్సింది,' అనుకుంది విచారంగా ఆలీసు. ఇక్కడ ఎవరికీ దయానా నచ్చినట్లు లేదు. ప్రపంచంలో కెల్లా ఇది మంచి పిల్లి. 'అయ్యో దయానా నిన్ను అసలు ఎప్పటికైనా చూస్తానో లేదో,' అంటూ ఒంటరితనం వల్ల, భయం వల్ల మళ్లీ ఏడవడం మొదలు పెట్టింది. అంతలో అడుగుల శబ్దం వినపడింది. మనసు మార్చుకుని తన కథ పూర్తిచేయడానికి ఎలుక వెనక్కి వస్తోందేమో అనుకుంది ఆలీసు.

# కుందేలు బల్లిని పంపించటం

తెల్ల కుందేలు నెమ్మదిగా నడుస్తూ వస్తోంది. ఏదో పోగొట్టుకున్న దానిలా ఆత్రంగా పరిసర ప్రాంతాల్ని చూస్తోంది. 'చెలియా! చెలియా! నా పాదాలు, నా ముద్దులొలికే మీసాలు. ఆమె నాకు శిరచ్ఛేదన శిక్ష విధించక తప్పదు. ఎక్కడ పోగొట్టుకున్నానురా బాబు!' అని తనలోతాను మాట్లాడుకుంటోంది. ఆలీసు కుందేలు మీద జాలిపడి వాటికోసం వెదకటం మొదలుపెట్టింది. కాని నీళ్లమడుగులో ఈదుకుని వచ్చిన తరవాత పరిసర ప్రాంతాలన్నీ మారిపోయాయి. అంత క్రితం ఉన్న పెద్ద గది, గాజు బల్ల, చిన్న తలుపు అన్నీ మాయం అయిపోయాయి.

కాసేపటికి కుందేలు ఆలీసుని చూసింది. "మేరి యాన్, ఇక్కడ నువ్వు ఏం చేస్తున్నావు? క్షణంలో ఇంటికి వెళ్లి నా విసనకర్ర, చేతి తొడుగులు తెచ్చిపెట్టు," అంటూ కోపంగా దారి చూపించింది కుందేలు. ఆలీసు భయపడి కుందేలు చూపించిన దారిన పరిగెత్తింది.

'నన్ను తన పనిమనిషి అనుకుంది. నేనెవరో తెలిసిన తరవాత ఆశ్చర్యపోతుంది,' అని ఆలీసు అనుకుంది. 'నాకు కనబడితే అతను అడిగిన విసనకర్ర, చేతి తొడుగులు తీసికుని వెళ్లడం మంచిది,' అని ఆలీసు అనుకుంటూ ఉండగా తన ముందు ఒక ఇల్లు చూసింది. దాని తలుపుకి ఉన్న ఇత్తడి రేకుమీద 'మిస్టరు కుందేలు' అని రాసి ఉంది. విసనకర్ర, చేతి తొడుగులు కనపడకముందే అసలైన మేరీ యాన్ వచ్చి తనని బయటకి తరిమేస్తుందనీ కంగారులో తలుపు కొట్టకుండానే ఇంట్లోకి వెళ్లి మేడమెట్లు ఎక్కసాగింది.

'ఇలా కుందేలుకి పనులు చెయ్యడం ఎంత విచిత్రంగా ఉంది?' అనుకుంది ఆలీసు. 'ఇక నా పిల్లి దయానాకి పనులు చేయాల్సి వస్తుందేమో! ఎటువంటి పనులు ఉంటాయో!' అని ఆలోచించడం మొదలుపెట్టింది. దయానా కూడా ఆదేశాలు ఇస్తుంటే, దానిని ఇంట్లో ఉండనివ్వరు అనుకుంది ఆలీసు.

ఇలా ఆలోచిస్తూ ఉండగా ఆలీసు ఒక చిన్న గదిలోకి ప్రవేశించింది. అక్కడ కిటికీ దగ్గరగా ఒక బల్ల వేసి ఉంది. దాని మీద ఒక విసనకర్ర; రెండు, మూడు జతల చేతి తొడుగులు ఉన్నాయి. అవి తీసుకుని బయటకు రాబోయేటప్పుడు ఆలీసు కళ్లు ఒక చిన్న సీసామీద పడ్డాయి. దానిమీద ఈసారి 'నన్ను తాగు' అని రాసి లేదు. అయినా కానీ ఆలీసు దాన్ని తాగడానికి నిశ్చయించుకుంది. 'ఎప్పుడు నేను ఏ పదార్థాన్ని తిన్నా, తాగినా కూడా ఏదో ఒకటి జరుగుతూనే ఉంది. ఈసారి కూడా ఏదో ఒక వింత జరగవచ్చు, బహుశా నేను మళ్లీ పెద్దగా ఎదుగుతానేమో! ఇలా చిన్నగా ఉండడం విసుగ్గా ఉంది,' అనుకుంది ఆలీసు.

అనుకున్నట్లుగానే ఆలీసు పెరిగి పోయింది. ఇంకా సగం సీసాకూడా అవకుండానే ఆ గదిలో పట్టనంతగా పెరిగిపోయింది. ఇంటి కప్పుకు తగిలి తన మెడ విరిగిపోతుందేమోనని భయపడి ఇంకా తాగడం మానేసింది. 'అయ్యో! ఇప్పుడు బయటకి వెళ్లడం ఎలా? అది అంత ఎక్కువ తాగకుండా ఉండాల్సింది,' అని అనుకుంది ఆలీసు.



అలా అనుకోవడం వల్ల ఇప్పుడు లాభంలేదు. ఆలీసు ఆగకుండా పెరిగి పోయింది. మోకాళ్లమీద కూర్చున్నా ఇంటి పైకప్పు తలకు తగులుతోంది. అందుకని ఆలీసు నేలమీద పడుకుంది. ఒక చేతిని తలుపుకు అడ్డంగా పెట్టి, ఇంకోచేతిని తలకింద పెట్టుకున్నా గది చాలటం లేదు. ఆఖరికి ఒక చేతిని కిటికీలోంచి బయటకు పెట్టింది. ఒక కాలుని ఇంటి చిమ్నీలోంచి బయటకు పెట్టింది. 'ఇక ఏం జరిగినా ఇంతకంటే నేనేం చేయలేను. నాకు ఏమవుతుందో ఏమో,' అని అనుకుంది.

అదృష్టవశాత్తు ఆలీసు పెరగడం ఆగిపోయింది. కాని అలా ఇరుక్కుని ఉండడం చాలా ఇబ్బందిగా ఉంది. అక్కడ నుండి బయటపడే మార్గం లేక విచారంగా ఆలోచించటం మొదలుపెట్టింది.

'చక్కగా ఇంటి దగ్గర ఉంటే బాగుండేది. ఇలా చిన్నగా, పెద్దగా అవడం, కుందేలు, ఎలకల వల్ల అజమాయిషీ చెయ్యబడటం ఉండేవి కావు. కుందేలు ఇంటిలోకి వెళ్లకుండా ఉండాల్సింది. కానీ ఇదంతా వింతగా ఉంది. ఇటువంటివి ఎక్కడైనా జరుగుతాయా అని కాశీమజిలీ కథలు చదివేటప్పుడు అనుకునేదాన్ని. వింతగా ఆ పరిస్థితిలో నేనే ఉన్నాను. నా గురించి ఎవరో పుస్తకం రాయాలి. తప్పకుండా రాయాలి. నేను పెద్దదాన్నయిన తరవాత ఒక పుస్తకం రాస్తాను. కాని నేను ఇప్పుడే పెద్దదాన్నయి పోయానే! ఇంకా పెరగటానికి స్థలం కూడా లేదు,' అనుకుంది విచారంగా.

'కానీ నేను ఇంతకంటే పెద్దదాన్ని కానా,' అనుకుంది ఆలీసు. 'ఎప్పటికీ ముసలితనం లేకుండా ఇలాగే ఉండిపోవటం బాగానే ఉంటుంది. కానీ ఎప్పుడూ పాఠాలు నేర్చుకుంటూ ఉండటం నాకు ఇష్టం లేదు.'

మళ్లీ తనలో తాను అనుకుంది ఆలీసు: 'ఇక్కడ పాఠాలు ఎలా నేర్చుకుంటాను? ఇక్కడ నాకే జాగా లేదు. ఇంక పుస్తకాలు ఎక్కడ పడతాయి.'

ఇలా ఒకసారి ఒకవైపున, మరోసారి మరోవైపున మాట్లాడుతూ చిత్రమైన సన్నివేశాలు ఊహించుకుంటోంది ఆలీసు. కొన్ని క్షణాల తరవాత బయట ఎవరివో మాటలు వినపడ్డాయి. ఆలీసు ఆలోచించడం ఆపి బయట మాటలు వినడానికి ప్రయత్నించింది.

"మేరి యాన్! మేరి యాన్! నా విసనకర్ర, చేతి తొడుగులు తెచ్చిపెట్టు," అంటున్న కుందేలు గొంతు వినిపించింది. కుందేలు తననే వెతుక్కుంటూ వస్తోందని ఆలీసుకి తెలిసింది. ఆలీసు భయంతో వణకడం మొదలుపెట్టింది. దాంతో ఇల్లంతా కదలడం ప్రారంభం అయింది. ఇప్పుడు తను కుందేలు కంటే వెయ్యిరెట్లు పెద్దగా పెరిగిందని, కుందేలుకి భయపడనవసరం లేదన్న విషయం ఆలీసు మరచిపోయింది.

ఈలోగా కుందేలు పైకివచ్చి, తలుపుని లోపలకి నెట్టటానికి ప్రయత్నించింది. కానీ ఆలీసు చెయ్యి అడ్డంగా ఉండడం వల్ల నెట్టలేకపోయింది. కుందేలు కిటికీలోనుండి లోపలికి వెళ్లాలి అనుకుంది.

అది తెలుసుకుని ఆలీసు, "నువ్వు అలా చేయవద్దు," అని తన చేతిని కిటికీలోనుండి బయటకు చాచి గాలిలో ఏదో పట్టుకున్నట్టు చేసింది. తను ఏం పట్టుకోలేదు కానీ ఎవరో గట్టిగా అరవడం, గాజుముక్కల శబ్దం వినపడ్డాయి. బహుశా కుందేలు దేనిమీదో పడి ఉంటుంది అనుకుంది ఆలీసు.



కుందేలు కోపంతో "పాట్, పాట్ ఎక్కడ ఉన్నావు?" అని పిలవడం వినిపించింది. అంతకు ముందు వినని గొంతునుంచి సమాధానం వినపడింది ఆలీసుకి. "ఇక్కడే ఉన్నాను సార్! ఆపిల్ కాయలు కోస్తున్నాను."

"ఆపిల్ కాయలు తరవాత కోద్దువుగాని. ముందు ఇక్కడకి వచ్చి నేను బయట పడడానికి సహాయం చెయ్యి," అంది కుందేలు. గాజుముక్కల శబ్దాలు మళ్లీ వినపడ్డాయి.

కుందేలు పాట్‌ని ఉద్దేశించి "ఇప్పుడు చెప్పు ఆ కిటికీలో ఏమిటి?" అని అంది.

"అది ఒక చెయ్యి సార్," అంది పాట్.

"అది చెయ్యి ఏమిటి? అంత పెద్దది ఎక్కడయినా చూశావా? కిటికీనంతా మూసేస్తోంది."

"అవునండీ. అది కిటికీనంతా మూసేస్తోంది. కాని అది చెయ్యేనండీ," అంది పాట్.

"అలా అయితే అవనీ. కాని అది అక్కడ ఉండడానికి వీలు లేదు. వెళ్లి దాన్ని అక్కడ నుండి తీసెయ్యి."

చాలాసేపు నిశ్శబ్దంగా ఉన్న తరవాత ఆలీసుకి గుసగుసలుగా మాట్లాడుకోవడం విపించింది. ఆలీసు మళ్లీ కిటికీలోనుండి చెయ్యి బయటకు పెట్టి గాలిలో దేన్నో పట్టుకునేందుకు ప్రయత్నించింది. ఈసారి రెండు గొంతుల అరుపులు, మరిన్ని గాజు ముక్కల శబ్దాలు వినిపించాయి. ఈసారి వీళ్లేం చేస్తారో అని ఆలీసు ఆలోచించడం మొదలుపెట్టింది: 'ఈ కిటికీలోనుండి నన్ను బయటకు లాగటానికి ప్రయత్నిస్తారేమో! వాళ్లు చెయ్యలేరు. కాని చెయ్యగలిగితే బాగుంటుంది. ఇక్కడ నేను ఇంక ఒక్క క్షణం కూడా ఉండలేను.'

చాలాసేపు వరకు ఏ విధమైన శబ్దం వినపడలేదు. చివరికి ఒక బండిలాంటి శబ్దం, కొంతమంది మాటలు వినపడ్డాయి: "నిచ్చెన ఎక్కడ ఉంది? – 'నేను తీసుకుని రాలేదు, కాని మిస్టరు బల్లి తెచ్చాడు, – ఆ నిచ్చెన ఇటు తీసుకురా! ఈ మూలకి వెయ్యి. – ముందు వాటిని రెండింటిని

కలిపి కట్టిన తరవాత వెయ్యి. – మిస్టరు బల్లి, ఈ తాడు పట్టుకో. ఈ బరువుకి పెంకులు ఆగుతాయా! అక్కడ ఒక పెంకు జారుతోంది, జాగ్రత్త! – అయ్యో అది కిందపడి పోతోంది, తలలు. – (పెద్ద శబ్దం) ఎవరు చేశారిది? – ఇంకెవరు, మిస్టరు బల్లి అయి ఉంటాడు. – చిమ్నీలోంచి దిగి ఇంట్లోకి ఎవరు వెళ్లగలరు? – 'నేను వెళ్లను. – నేను వెళ్లను. – మిస్టర్ బల్లి లోపలికి వెళ్లాలి.'



'ఓహో! మిస్టర్ బల్లి చిమ్నీ ద్వారా ఇంట్లోకి వస్తాడన్నమాట,' అనుకుంది ఆలీసు. 'వాళ్లు పని అంతా పాపం మిస్టర్ బల్లి మీద వేస్తున్నారు. నేనయితే ఆ పరిస్థితుల్లో ఒక్క క్షణం కూడా ఉండను. ఈ పొగగొట్టం చాలా సన్నగా ఉంది. కాలితో చిన్నగా తన్నటానికి ప్రయత్నించవచ్చేమో,' అని ఆలీసు తనలో తాను అనుకోసాగింది.

ఆలీసు కొంచెంసేపు ఆగింది. అప్పుడు ఒక జంతువు ఏదో గీరినట్లు శబ్దం వినపడింది. అది మిస్టర్ బల్లి అయి ఉండాలి అని అనుకుంటూ ఆలీసు ఒక్క తన్ను తన్ని ఏం జరుగుతుందో వేచి చూడసాగింది.

అందరూ ఒక్కసారిగా "మిస్టర్ బల్లి గాలిలోకి దూసుకు పోతున్నాడు?" అన్నారు. "అదిగో

అక్కడ! పట్టుకోండి," అని అంది కుందేలు. "తల పట్టుకోండి, కొంచెం మంచినీళ్లు ఇవ్వండి. ఎలా ఉంది మిస్టర్ బల్లి? ఏమయింది? జరిగినదంతా చెప్పు," అన్నారు అందరూ ఏక కంఠంతో.

"ఇప్పుడు బాగానే ఉన్నాను. నిజంగా ఏం జరిగిందో నాకు తెలియదు. కానీ ఏదో అకస్మాత్తుగా తన్నినట్లయింది, నేను రాకెట్‌లా పైకి పోయాను," నెమ్మదిగా అన్నాడు మిస్టర్ బల్లి.

"అవును," అన్నారు అందరూ.

"ఈ ఇంటికి మంటలు పెట్టాలి," అంది కుందేలు. ఆలీసు అది విని "అలా అయితే నేను డయానాని పిలుస్తాను," అని గట్టిగా అంది.

అంతా నిశ్శబ్దంగా అయిపోయింది. వెంటనే ఆలీసు తనలో తాను అనుకుంది, 'ఇప్పుడు ఏం చెయ్యాలనుకుంటున్నారో! వాళ్లకి ఏమాత్రం తెలివితేటలున్నా వెంటనే పై పెంకులు తీస్తారు.' ఒకటి రెండు క్షణాల తరవాత అందరూ కదిలిన శబ్దం అయింది. ఆలీసుకి "ఒక బండెడు అయితే చాలు," అన్న కుందేలు మాటలు వినపడ్డాయి.

'బండెడు ఏమిటి చెప్మా,' అనుకుంది ఆలీసు. కొంచెం సేపటికే చిన్న చిన్న రాళ్లు వర్షంలా పడడం మొదలయ్యాయి. కొన్ని ఆలీసు ముఖానికి తగిలాయి. దాన్ని ఆపాలనుకుని ఆలీసు, "మళ్లీ రాళ్లు వేశారంటే చూసుకోండి," అని గట్టిగా అరిచింది. ఆ ప్రదేశమంతా మళ్లీ నిశ్శబ్దం అయిపోయింది.

ఆలీసు ఆ రాళ్లవైపు ఆశ్చర్యంగా చూసింది. కిందపడ్డ రాళ్లన్నీ చిన్నచిన్న రొట్టెల్లా అయ్యాయి. వాటిని చూడ్డంతో ఆలీసుకు ఒక అద్భుతమైన ఆలోచన వచ్చింది. 'ఈ రొట్టె ఒకటి తింటే,' అనుకుంది ఆలీసు, 'అది తప్పకుండా నా ఆకారాన్ని మారుస్తుంది, ఇంకా పెద్దగా అవడానికి అవకాశం లేదు కాబట్టి బహుశా చిన్నగా అవుతానేమో!'

ఇలా అనుకుని ఒక రొట్టెను తిన్నది, ఆ వెంటనే ఆలీసు చిన్నగా మారింది. చిన్నగా మారడంతో ఆలీసు ఇంటి బయటకు వచ్చి అక్కడ ఉన్న

పక్షులు, జంతువుల గుంపులను చూసింది. పాపం మిస్టర్ బల్లిని పట్టుకుని రెండు కుందేలు పిల్లలు మంచినీళ్లు ఇస్తున్నాయి. ఆలీసును చూడ్డంతోనే అందరూ ఆత్రంగా చేరబోయారు. కానీ ఆలీసు వేగంగా పరిగెత్తి అడవుల్లోకి వెళ్లిపోయింది.

ఆలీసు తనలో తాను అనుకుంది: 'ముందుగా నా నిజమైన ఆకారం తెచ్చుకోవాలి. తరవాత అక్కడ ఉన్న ఉద్యానవనంలోకి వెళ్లాలి.'

ఆలోచన చాలా బాగుంది కానీ ఎలా అమలుపరచాలో తెలియలేదు. ఇలా ఆత్రంగా ఆ అడవిలో తిరుగుతూ ఉండగా ఒక కొమ్మ తలకు తగలడంతో పైకి చూసింది ఆలీసు.



ఆ కొమ్మ మీద ఒక పెద్ద కుక్కపిల్ల కూర్చుని, ఆలీసుని ముట్టు కునేందుకు ప్రయత్నం చేస్తోంది. "అయ్యో! పాపం," అని దానికి సహాయం చెయ్యాలనుకుంది ఆలీసు. కాని ఒక వేళ ఆ కుక్కపిల్లకు ఆకలిగా ఉంటే తనను తినేస్తుందేమో అని భయపడింది.

తెలియకుండానే ఆలీసు ఒక కర్ర తీసుకుని కుక్క కిందికి దిగడానికి సహాయపడింది. కానీ ఆ కుక్కకి ఇది ఒక ఆటలా అనిపించి ఆలీసు చేతిలోని కర్ర కోసం పరిగెత్తడం మొదలుపెట్టింది. కుక్క కాళ్లకింద ఎక్కడ నలిగిపోతానో అని ఆలీసు భయపడసాగింది. ఆ కుక్క నుండి తప్పించుకోడానికి ఆలీసు చాలాసేపు పరిగెత్తి చివరకు ఒక చెట్టు వెనక దాక్కుంది. కుక్క ఆఖరుకి అలసిపోయి కూర్చుంది. అదే సరైన సమయమని ఆలీసు ఆగకుండా పరిగెత్తుకుంటూ ఆ కుక్కనుండి ఎంతదూరం వెళ్లగలిగితే అంత దూరం వెళ్లింది.

కానీ 'ఆ కుక్క ఎంత బాగుంది,' అనుకుంది ఆలీసు. 'నేను సరైన ఆకారంలో ఉంటే దానికి అన్ని రకాల ఆటలు నేర్పగలిగేదానిని,' అనుకుంది. అప్పుడు గుర్తుకు వచ్చింది ఆలీసుకి తను ఏదో ఒకటి చేయాలని.

మళ్లీ తన మామూలు ఆకారం రావాలంటే ఆలీసు ఏదో ఒకటి తినడమో, తాగడమో చేయాలి. కానీ ఏం తినాలో, ఏం తాగాలో తెలియలేదు. ఆ ప్రదేశంలో తన పక్కనే ఒక పుట్టగొడుగు కనపడింది. దాని కింద చూసింది, దాని రెండుపక్కలా చూసింది, దాని వెనక చూసింది. దాని పైన ఏముందో చూద్దామన్న ఆలోచన వచ్చింది.

కాలి వేళ్లమీద నిలబడి పుట్టగొడుగు మీదకి చూసేసరికి పెద్ద నీలంరంగు గొంగళి పురుగు చేతులు కట్టుకుని, పెద్ద హుక్కా పీలుస్తూ ప్రపంచంతో సంబంధం లేనిదానిలా కూర్చుని ఉంది.

# గొంగళి సలహా

ఆలీసు, గొంగళి ఒకరివైపు ఒకరు కొద్దిసేపు మాట్లాడకుండా చూసుకున్నారు. ఆఖరికి గొంగళి తన నోటిలోని హుక్కాను తీసి మత్తుగా "నువ్వు ఎవరు?" అంది.



ఆలీసుకి అది సరైన ప్రశ్నలా అనిపించలేదు. “నాకు... నాకు ఎలా చెప్పాలో తెలియడం లేదు. ఈ రోజు ఉదయం లేచినప్పుడు నేనెవరో నాకు తెలుసు. కానీ ఇప్పటివరకు నాలో చాలాసార్లు చాలా మార్పులు వచ్చాయి. అందువల్ల ఎలా చెప్పాలో తెలియడం లేదు,” అంది ఆలీసు.

“దాని అర్థం ఏమిటి? వివరణ ఇవ్వు,” కోపంగా అంది గొంగళి.

“నేను చెప్పలేను. చూడండి, నేను నేను కాదు,” అంది ఆలీసు.

“నాకు కనపడడం లేదు,” అంది గొంగళి.

“అయ్యో! నేను ఇంతకంటే మరేమీ చెప్పలేను,” అంది ఆలీసు మర్యాదగా. “ఇక్కడ జరుగుతున్న విశేషాలు, వింతలు నాకసలు అర్థం కావటంలేదు. చాలా అయోమయంగా ఉంది.”

“అదేంకాదు,” అంది గొంగళి.

“అంటే నీకు ఇంకా ఈ అనుభవాలు అర్థం కాలేదన్నమాట. బహుశ నువ్వు ముందు కోశస్థదశలోకి ఆ తరవాత సీతాకోకచిలుకగా మారినప్పుడు నీకు ఈ వింతల విశేషం తెలియవచ్చు!” అంది ఆలీసు.

“ఏం కాదు,” అంది గొంగళి.

“అలాగా! నీ అనుభవాలు పరిపరి విధాలేమో, కాని నాకు అన్నీ వింతగా ఉన్నాయి,” అంది ఆలీసు.

“నువ్వా! ఎవరు నువ్వు?”

మళ్లీ కథ మొదటికి వచ్చింది. ఆలీసుకి గొంగళి వ్యవహారం చిరాకుగా అనిపించింది. కోపంగా “నువ్వెవరో ముందు చెప్పు,” అంది ఆలీసు.

“ఎందుకు?” అంది గొంగళి.

“ఇది ఇంకొక అర్థంలేని ప్రశ్న,” అంది ఆలీసు. ఆలీసుకి ఏం చెప్పాలో, ఏం చెయ్యాలో కూడా తెలియక అక్కడి నుండి వెళ్లిపోసాగింది.

“ఏయ్! ఇలా రా! నీతో చాలా ముఖ్యమైన విషయం మాట్లాడాలి!” అని పిలిచింది గొంగళి.

ఏం చెబుతుందోనన్న ఆసక్తితో వెనక్కి వచ్చింది ఆలీసు. “అలాగే గర్వంగా ఉండు,” అంది గొంగళి.

కోపాన్ని దిగమింగుతూ "ఇదేనా నువ్వు చెప్పదలుచుకుంది?" అంది ఆలీసు.

"కాదు," అంది గొంగళి.

తనకింక వేరే పనిలేదు కాబట్టి ఆలీసు కొంతసేపు అక్కడే ఉండడానికి నిశ్చయించుకుంది. కొంతసేపు ఉంటే గొంగళి బహుశః ఏమన్నా చెబుతుందేమోనన్న ఆశతో, ఓపికతో నిలబడింది. గొంగళి హుక్కాను పీలుస్తూ, చేతులు ముడుచుకుని విడదీసుకుంటూ "అయితే నువ్వు మారిపోయావని అనుకుంటున్నావన్నమాట?" అంది.

"అదే అనిపిస్తోంది. నాకు పూర్వంలా జ్ఞాపకశక్తి లేదు. ఒకే ఆకారంలో ఎంతోసేపు ఉండలేకపోతున్నాను," అంది ఆలీసు.

"ఏ ఏ విషయాలు జ్ఞాపకం ఉండడం లేదు?" అంది గొంగళి.

"నేను నేర్చుకున్న పాట గుర్తుకు తెచ్చుకోటానికి ప్రయత్నించాను. కానీ పదాలన్నీ మారిపోయాయి," అంది ఆలీసు.

గొంగళి దానికి సమాధానంగా " 'నాన్నా, ముసలివాడివి నువ్వు,' అన్నది చెప్పు," అంది.

కొంతసేపు ఆలోచించి ఆలీసు ఇలా చెప్పడం మొదలుపెట్టింది:

*అన్నాడు కొడుకు "నాన్నా, ముసలివాడివి నువ్వు,"*
*"జుట్టు నెరసి తెల్లబడి పోయింది;*
*అయినా శీర్షాసనం వేస్తావు -*
*ఈ వయసులో నీకు ఇదేం బుద్ధి?"*

*తండ్రి కొడుకుకి బదులిచ్చాడు ఇలా:*
*"చిన్నప్పుడు దీనివల్ల మెదడు దెబ్బతింటుందనుకున్నాను;*
*ఇప్పుడు అది లేనేలేదని తెలుసుకున్నాను,*
*అందుకే వేస్తున్నాను మరలా, మరలా."*



"నాన్నా, నువ్వు ముసలి," అన్నాడు కొడుకు సందేహిస్తూ
"నువ్వు బాగా లావు, నీది బానపొట్ట;
లోపలికొస్తావు పిల్లిమొగ్గలేస్తూ,
దీని వెనక రహస్యం ఏమిటంట?"



జుట్టు ఎగరేస్తూ తండ్రి చెప్పాడు: "ఇదిగో లేపనం,
ఇస్తుందిది నాకు నిత్య యవ్వనం;
దీని ఖరీదు కేవలం రూపాయి,
ఉపయోగిస్తే ఉంటుంది హాయి."

అన్నాడు కొడుకు "నాన్నా నువ్వు ముసలి,
కదిలిపోయాయి నీ పళ్లు;
తినలేవు ఏదీ గట్టిగా నమిలి,
మరి ఎలా లాగించావు కోడీ, దాని కాళ్లు?"



"నేను చదివింది న్యాయ శాస్త్రం
నా వాగ్ధాటే నాకున్న అస్త్రం
మేటిఅని మెచ్చుకునేవారు అంతా
దవడ పుష్టి ఉండిపోయింది జీవితమంతా."

*"నాన్నా నీకు ముదిమి దాపురించింది*
*చూపేమో పూర్తిగా మందగించింది*
*అయినా ముక్కుపై నిలబెట్టావు చేప పాముని*
*ఎలా చేయగలవు ఇంతటి ఘనకార్యాన్ని?"*



*"సమాధానాలిస్తున్నానని అడుగుతూనే ఉన్నావు*
*గొప్పవాడిననుకుంటూ నన్ను పరిహసిస్తున్నావు*
*ఇంతటితో దయచేయి, ఎంతో సంతోషిస్తాను*
*పోకపోయావో నడ్డి విరగదన్నుతాను."*

"సరిగ్గా చెప్పలేదు నువ్వు," అంది గొంగళి.

"అవుననుకుంటాను. కొన్ని పదాలు మరిచిపోయాను," అంది ఆలీసు భయపడుతూ.

"అంతా తప్పు. మొదటినుంచి చివరి వరకు తప్పు," అంది గొంగళి. కొంతసేపు నిశ్శబ్దం అలుముకుంది.

చివరికి గొంగళి ముందు మాట్లాడింది.

"అయితే నువ్వు ఎంత పొడుగ్గా ఉండాలనుకుంటున్నావు?" అంది గొంగళి.

"ఎంత పొడవు అయినా ఫరవాలేదు నాకు. కానీ క్షణక్షణానికీ మారడం మాత్రం నచ్చలేదు," అంది ఆలీసు.

"నాకు అదేమీ తెలియదు," అంది గొంగళి.

ఆలీసు ఏమీ మాట్లాడలేదు. ఇంతటి పరస్పర విరుద్ధ ప్రవర్తనని ఆలీసు ఇంతవరకు చూడలేదు.

"ఇప్పుడు నీకు తృప్తిగా ఉందా?" అంది గొంగళి.

"ఇంకొంచెం పొడుగ్గా ఉంటే బాగుంటుంది. మూడు అంగుళాల పొడవు అంత బాగాలేదు," అంది ఆలీసు.

"మూడు అంగుళాలు మంచి పొడవే," అని కోపంగా లేచింది గొంగళి. (గొంగళి సరిగ్గా మూడు అంగుళాలే ఉంది.)

"మూడు అంగుళాలు పొడవు నాకేమంత బాగా లేదు," జాలిగా అంది ఆలీసు. 'ఇక్కడ వాళ్లంతా ఊరికే కోపం తెచ్చుకోకుండా ఉంటే బాగుండును,' తనలో తాను అనుకుంది ఆలీసు.

"కొంతకాలానికి ఈ పొడవు నీకు అలవాటు అవుతుందిలే," హుక్కా పీల్చుకుంటూ అంది గొంగళి.

గొంగళి మాట్లాడేవరకు ఓపికగా వేచి ఉంది ఆలీసు. ఈసారి గొంగళి కాసేపు ఆగి, నోట్లోంచి హుక్కాను తీసి ఒళ్లు విరుచుకుని ఒకటి రెండుసార్లు ఆవులించింది. పుట్టగొడుగు మీదినుంచి లేచింది. ఏమీ మాట్లాడకుండా గడ్డిమీద కొంచెం దూరం నడిచింది. "ఒకవైపు నిన్ను పొడవుగానూ, మరోవైపు నిన్ను పొట్టిగానూ చేస్తుంది," పోతూ, పోతూ అంది గొంగళి.

'దేనికి ఒకవైపు, దేనికి మరొకవైపు?' తనలోతాను అనుకుంది ఆలీసు.

తను ప్రశ్న పైకి అడిగినట్లు "పుట్టగొడుగుకి," చెప్పింది గొంగళి. తిరిగి చూసేలోగా గొంగళి మాయమయింది.

అక్కడ గుండ్రంగా ఉన్న పుట్టగొడుగును పరీక్షగా చూసింది. ఆలీసు.

ఏ భాగం తినాలా అని ఆలోచించి, ఏ భాగమైతేనేం, అని రెండు చేతులూ చాచి రెండువైపుల నుంచి రెండు కొంతలు తుంచింది.

ఏది తింటే ఏమవుతుందో అని అనుకుంటూనే చివరికి కుడి చేతిలో ఉన్న ముక్కలో చిన్నభాగం కొరికింది. వెంటనే గడ్డం కింద ఏదో దెబ్బ తగిలినట్లు అనిపించింది. ఆలీసు అమాంతంగా చిన్నగా మారిపోయి గడ్డం వెళ్లి పాదాన్ని తాకింది!

అంత త్వరగా తనలో అంతటి మార్పు కలగడంతో భయపడి పోయింది. ఇంకా చిన్నగా మారకుండానే రెండవ భాగం తిని చూడాలని అనుకుంది, కానీ నోరు తెరవడానికి చోటులేకపోయింది. ఎలాగైతేనేం మెల్లగా చిన్న ముక్కని కొరకగలిగింది.

* * *

'అమ్మయ్య! నా తలకాయకి విముక్తి కలిగింది,' అనుకుంది. అంతలోనే తన భుజాలు ఎక్కడ ఉన్నాయో తెలియని అనుభూతి కలగడంతో వెంటనే ఆశ్చర్యపోయింది. కిందకి చూస్తే చాలా పొడవైన మెడ మాత్రమే కనిపించింది. పచ్చటి ఆకుల సముద్రం నుంచి పొడుచుకొచ్చిన కాడలాగా ఉంది ఆమె మెడ.

చేతులు కదపడానికి ప్రయత్నించింది. కానీ అవి ఎక్కడ ఉన్నాయో తెలియలేదు. ఎక్కడో దూరాన కొన్ని ఆకులు కదిలినట్లు అనిపించింది. చేతులను తల దగ్గరకు తీసుకురాలేకపోవటంతో తలనే చేతులవద్దకు తీసుకెళదామని చూసింది. తన మెడను పాములా ఇష్టం వచ్చిన వైపు తిప్పగలిగినందుకు చాలా సంతోషించింది. తను చాలా పొడవుగా మారినట్లు అప్పుడు అర్థమయ్యింది ఆలీసుకి. అలా ఉండగా ఒక పావురం వచ్చి తన ముఖం మీద రెక్కలు ఆడించడం మొదలుపెట్టింది.

"పాము! పాము!" అని అరిచింది పావురం.

"నేను పామునికాదు! నన్ను విడిచిపెట్టు," అంది ఆలీసు.

"నువ్వు పామువే!" ఈసారి మెల్లగా అంది పావురం. "ఏం చేసినా ఫలించటం లేదు!" అంటూ కంట తడిపెట్టింది పావురం.

"నువ్వనేది నాకేమీ అర్థం కావడం లేదు," అంది ఆలీసు.

"పాములను అరికట్టడానికి చాలా ప్రయత్నాలు చేశాను. గూడులో మూలికలు పెట్టాను. చెరువు ఒడ్డున, కంచెలో గూడు కట్టి చూశాను. ఏదీ పనిచెయ్యలేదు," అంది పావురం.

ఆలీసుకి ఏమీ అర్థం కాకపోయినా పావురం చెప్పినదంతా వింది.

"గుడ్లు పొదగటమే పెద్దపని అనుకుంటే రాత్రింబవళ్లు ఈ పాముల నుంచి కాపలా కాసే పని ఒకటి. అసలు గత మూడు వారాలుగా నాకు నిద్ర లేదు," అంది పావురం.

పాపం! పావురం చెబుతున్నది గ్రహించి, "అయ్యో నువ్వు చాలా చికాకుల్లో ఉన్నావు," అంది ఆలీసు.

"అడవిలో అన్నిటికంటే పెద్ద చెట్టు చూసుకుని గూడు కట్టుకున్నాను," అరుస్తూ చెప్పసాగింది పావురం. "పాముల పీడ విరగడయ్యింది అనుకుంటూ ఉండగా అది ఆకాశం నుండి మెలికలు తిరుగుతూ వస్తోంది. పాడు పాము!"

"నేను పాముని కాదు," అంది ఆలీసు. "నేను... నేను..."

"అయితే మరి ఎవరివి నువ్వు? ఏదో కల్పించి చెపుదామని అనుకుంటున్నావా?" అంది పావురం.

"నేను, నేను చిన్నపిల్లని," అంది అనుమానంగా ఆలీసు. ఉదయం నుండి తనలో వచ్చిన మార్పులను మననం చేసుకోసాగింది ఆలీసు.

"నేను అనుకున్నట్లుగానే చెప్పావు కథని. నేను చాలామంది ఆడపిల్లలను చూశాను. కానీ నీలాంటి పొడవైన మెడ ఉన్నవాళ్లని ఎప్పుడూ చూడలేదు. నువ్వు తప్పకుండా పామువే. నాకు అబద్ధాలు చెప్పి మోసగించలేవు. గుడ్డు రుచే చూడలేదని బుకాయిస్తావు ఇక," అంది పావురం.

"నేను గుడ్లు తిన్నాను," నిజాయితీగా చెప్పింది ఆలీసు. "కానీ, పాముల మాదిరిగానే అమ్మాయిలు కూడా గుడ్లు తింటారు తెలుసా?"

"నేనేం నమ్మను," అంది పావురం. "పిల్లలు కూడా గుడ్లను తింటే వాళ్లు కూడా ఒక రకమైన పాములు అవుతారని చెప్పగలను," అంది పావురం.

ఇదీ ఒకరకమైన కొత్త ఆలోచనే అనుకుని రెండు క్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయింది ఆలీసు. అదే సమయంలో “నాకు తెలుసు. నువ్వు గుడ్లకోసం చూస్తున్నావు. నువ్వు చిన్నపిల్లవయితేనేం, పామువైతేనేం,” అంది పావురం.

“నీకేం తేడాలేదేమో, కాని నాకు మాత్రం ఉంది. నేను గుడ్లకోసం చూడడం లేదు. ఒకవేళ చూస్తున్నా నీ గుడ్లని మాత్రం తినను. నాకు పచ్చిగుడ్లు నచ్చవు,” అని అంది ఆలీసు.

“అయితే ఇక్కడి నుండి వెళ్లిపో,” అంటూ పావురం గూట్లోకి వెళ్లిపోయింది. ఆలీసు పాపం తాను ముడుచుకోగలిగినంత ముడుచుకుంది. కాని ఆలీసు మెడ ఆ కొమ్మలలో చిక్కుకుపోతూ బాధ పెట్టసాగింది. మధ్యమధ్యలో ఆగి మెలిపడిన మెడను తప్పించాల్సి వస్తోంది. కొంతసేపటి తరవాత తన చేతిలో ఇంకా ఆ పుట్టగొడుగు ముక్కలు ఉన్నట్లు జ్ఞాపకము వచ్చింది. రెండు చేతులనుంచి చిన్న చిన్న ముక్కలు తినడం మొదలుపెట్టింది. దాంతో ఒకసారి పెద్దదయి, ఇంకొకసారి చిన్నదయి, ఎలాగైతేనేం చివరికి తన అసలు పొడవుకు వచ్చింది.

తన నిజపరిమాణంలోకి వచ్చినా, ఆ పొడవుకి అలవాటు పడడానికి కొంతకాలం పట్టింది. మళ్లీ తనలో తాను మాట్లాడుకోవడం మొదలుపెట్టింది. ‘క్షణ, క్షణానికీ మార్పులే. ఈనాడు జరిగినవన్నీ ఆశ్చర్యకరమైన విశేషాలే. ఎలా అయితేనేం నా మామూలు శరీరం నాకు వచ్చింది. ఇప్పుడు ఆ ఉద్యానవనంలోకి వెళ్లాలి. కానీ ఎలా?’ అని అనుకుంటూ ఉండగా ఒక మైదానం చేరింది. అక్కడ 4 అడుగుల ఎత్తయిన ఇల్లు కనిపించింది. ‘ఇంత చిన్న ఇంట్లో ఎవరుంటారు చెప్మా! ఇక్కడ ఉన్న వాళ్లందరినీ భయపెట్టాలి,’ అనుకుంటూ కుడి చేతిలో ఉన్న పుట్టగొడుగు ముక్కని తింది. మళ్లీ ఆ పుట్టగొడుగు ప్రభావంతో 9 అంగుళాల పొడవు అయ్యింది.

# పంది - మిరియాలపొడి

ఆ ఇంటి వైపు చూస్తూ రెండు క్షణాలు నుంచుంది ఆలీసు. ఇప్పుడు ఏం చెయ్యాలా అని అనుకుంటూ ఉండగా ఒక బంటు పొదలలోనుండి పరిగెత్తుకుంటూ వచ్చాడు. ముఖం చూస్తే చేప అనవచ్చు, కాని అతని దుస్తులను బట్టి బంటు అనుకోవడానికి అవకాశం ఉంది. ఆ చేపలాంటి బంటు ఆ ఇంటి తలుపులను దబదబా కొట్టాడు. ఒక కప్పలాంటి బంటు వచ్చి తలుపులు తెరిచాడు. వాళ్లిద్దరి జుట్టు ఉంగరాలు తిరిగి తెల్లగా పిండిపోసినట్లుగా ఉంది. ఆలీసుకి ఇదంతా వింతగా అనిపించింది. ఇంక ఏమి జరగబోతోందోనని ఆతృతగా కొంచెం ముందుకు వచ్చి వినసాగింది.

చేపలాంటి బంటు తన చంకలోనుండి తనంత పెద్దగా ఉన్న ఒక ఉత్తరాన్ని తీసి కప్ప బంటుకి ఇచ్చాడు: "ఇది రాణీగారు, యువరాణి గారిని మైదానంలో బంతి ఆట ఆడేందుకు ఆహ్వాన పత్రం." ఆ పత్రాన్ని అందుకుని కప్ప బంటు అదే వాక్యాన్ని పదాలు మార్చి పలికాడు "మైదానంలో బంతి ఆట ఆడేందుకు యువరాణిగారికి రాణీగారినుంచి ఆహ్వాన పత్రం."



ఇద్దరూ వంగి ఒకరికొకరు నమస్కారం చేస్తున్నప్పుడు వాళ్లిద్దరి జుట్టులు చిక్కుపడి పోయాయి.

ఈ దృశ్యాన్ని చూసేసరికి ఆలీసుకి ఆపుకోలేనంత నవ్వు వచ్చింది. వాళ్లు ఆమె నవ్వు ఎక్కడ వింటారో అనే భయంతో అడవిలోకి వెళ్లిపోయింది ఆలీసు. కొంతసేపటికి చూస్తే చేప బంటు అక్కడనుండి వెళ్లిపోయాడు. కప్పబంటు మాత్రం గుమ్మం దగ్గర కూర్చుని ఆకాశం వైపు చూస్తున్నాడు.

ఆలీసు గుమ్మం దగ్గరకు వెళ్లి కొంచెం భయంగా తలుపు తట్టింది.

"నేనూ నీలాగే బయట కూర్చున్నాను కాబట్టి తలుపులు తట్టడం వల్ల లాభం లేదు. అంతేకాక లోపల వాళ్లంతా గోల చేస్తున్నారు. ఎవరికీ వినపడదు," అన్నాడు కప్పబంటు. అతను అన్నట్లు లోపల ఎవరివో అరుపులు, తుమ్ములు, మధ్య మధ్య ఏవోవో విరిగిన శబ్దాలు చాలా వినపడ్డాయి.

"అలా అయితే నేను లోపలికి వెళ్లడం ఎలా?" అంది ఆలీసు.

"ఈ తలుపు మన ఇద్దరి మధ్య ఉంటే నువ్వు తలుపు తట్టడంలో అర్థం ఉంది. నువ్వు లోపల ఉండి తలుపు తడితే అప్పుడు తలుపును తెరిచి నిన్ను బయటకు పొమ్మనేవాడిని," అంటూ తన ధోరణిలో తను ఆకాశం వైపు చూస్తూ చెప్పుకుపోయాడు కప్పబంటు. అలా తనవైపు చూడకుండా మాట్లాడడం ఆలీసుకు చాలా అసభ్యంగా అనిపించింది. అయినా కప్పకి కళ్లు నెత్తిమీద ఉన్నాయి. 'పాపం! సరిగ్గా చూడలేడేమో,' అనుకుంది ఆలీసు. 'ఏమైతేనేం నేను అడిగిన ప్రశ్నలన్నింటికి సమాధానం చెపుతున్నాడు. ఫరవాలేదు,' అనుకుని మళ్లీ "లోపలకి వెళ్లడం ఎలా?" అని గట్టిగా అడిగింది.

"నేను ఇక్కడ ఇలాగే రేపటి వరకు కూర్చుంటాను..." అని అన్నాడు కప్పబంటు.

ఇంతలో తలుపు తెరుచుకుని ఒక పింగాణి పళ్లెం కప్ప తలకి రాసుకుంటూపోయి చెట్టుకు తగిలి ముక్కలై పోయింది.

"...లేకపోతే ఎల్లుండి వరకు," అంటూ కప్పబంటు ఏమీ జరగనట్టే పూర్వం చెపుతున్న గొంతుతోనే చెప్పసాగాడు.

"నేను లోపలకి ఎలా వెళ్లాలి?" అని ఇంకా గట్టిగా అంది ఆలీసు.

"లోపలికి నువ్వు వెళ్లాలా? అది మొదటి ప్రశ్న," అన్నాడు కప్పబంటు.

కప్పబంటు అలా అడగడం ఆలీసుకి నచ్చినట్లు లేదు. 'ఇక్కడ వీళ్లంతా వితండవాదాలు చేస్తూ, పిచ్చి ఎక్కించేస్తున్నారు. ఇప్పుడేం చెయ్యాలిరా బాబూ,' అనుకుంది ఆలీసు.

ఇదే అవకాశంగా భావించి కప్పబంటు "నేను రోజుల తరబడి ఇక్కడే కూర్చుంటాను," అన్న వాక్యాన్ని రకరకాలుగా పలకసాగాడు.

"మరి నేను ఏం చేయను?" అడిగింది ఆలీసు.

"నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి," అంటూ ఈల వెయ్యడం మొదలుపెట్టాడు కప్పబంటు.

'ఈ కప్పబంటుతో మాట్లాడడం వల్ల ప్రయోజనం లేదు. ఎందుకూ పనికి రానివాడు,' అనుకుని తలుపు తెరిచి లోపలికి వెళ్లింది ఆలీసు.

ఆ తలుపు ఒక పెద్ద వంటఇంటిలోకి తెరుచుకుంది. ఆ గది అంతా పొగతో నిండిపోయి ఉంది. గది మధ్యలో మూడు కాళ్ల పీటమీద యువరాణి



తన బాబుకి పాలు ఇస్తూ కూర్చుంది. ఒక వంటావిడ పొయ్యిమీద చారు కాస్తూ ఉంది.

'ఆ చారులో మిరియాల పొడి ఎక్కువగా ఉంది,' అనుకుంటూ ఆలీసు పెద్ద తుమ్ము తుమ్మింది.

గది అంతా మిరియాలఘాటుతో నిండిపోయింది. యువరాణి కూడా తుమ్మింది. ఆ బాబు కూడా ఆపకుండా తుమ్ముతూ, అరుపులు, ఏడుపు మొదలుపెట్టాడు. అక్కడ తుమ్మకుండా, దగ్గకుండా ఉన్నది వంటావిడ, పొయ్యికి దగ్గరగా కూర్చున్న పెద్దపిల్లీ మాత్రమే. ఆ పిల్లి ముఖంలో ఈ చెవినుంచి ఆ చెవివరకు నోరు సాగదీసిన నవ్వు కనబడుతోంది.

"ఆ పిల్లి ఎందుకు అలా నవ్వుతోంది?" అని అతి మర్యాదగా యువరాణిని అడిగింది ఆలీసు.

"అది జాతిపిల్లి, నీకు తెలియదా. పందీ!" అని ఆలీసుతో అంది యువరాణి.

ఆఖరిమాట రాణి కోపంగా అనటం విని ఆలీసు ఒక్కసారి ఉలిక్కి పడింది. అయితే మరుక్షణమే ఆ మాట తనని కాకుండా బాబును ఉద్దేశించి అంది అని తెలుసుకుని ధైర్యం కూడగట్టుకుని "జాతి పిల్లులు నవ్వుతాయని నాకు తెలియదు," అంది ఆలీసు.

"దాదాపుగా అన్ని జాతిపిల్లులు నవ్వుతాయి," అంది యువరాణి.

"నవ్వే ఒక్క పిల్లీ నాకు తెలియదు," అంది ఆలీసు.

"నీకేమీ తెలియదులే," అంది యువరాణి.

ఆలీసుకి ఈ సంభాషణ ఎంతమాత్రం నచ్చలేదు. ఈ ప్రసక్తి మార్చి వేరే ఏదైనా మాట్లాడాలనుకుంది. ఏమి మాట్లాడాలా అని ఆలోచిస్తూ ఉండగా వంటావిడ చారుని పొయ్యిమీద నుంచి దించి పక్కగా పెట్టి తన చుట్టూ ఉన్న గిన్నెలు, గ్లాసులు, కంచాలు, ఆఖరికి నిప్పుచువ్వలను కూడా యువరాణి మీదకి, బాబు మీదకి విసరడం మొదలుపెట్టింది. యువరాణి ఇవి ఏమీ పట్టించుకోలేదు. కొన్ని తనకు తగిలినా ఏమీ అనలేదు. చంటిపిల్లవాడు సరేసరి, అరుపులు, ఏడుపు ఒక్క క్షణం కూడా మానలేదు. దెబ్బ తగిలిందో,

లేదో తెలియటం లేదు.

ఆలీసు కోపంగా వంటామెని, "ఏం చేస్తున్నావో తెలుస్తోందా?" అని మందలించింది.

"ఎవరిపని వాళ్లు చూసుకుంటూ ఉంటే ఈ ప్రపంచం ఇంకా వేగంగా ప్రయాణించేది," అంది యువరాణి.

ప్రసక్తి మారింది కదా, ఇదే సమయమని ఆలీసు తన తెలివితేటల్ని ప్రదర్శించాలని, "ప్రపంచం వేగంగా ప్రయాణించడం వల్ల ప్రయోజనమేమీ లేదు. అలా అయితే రాత్రి, పగళ్లు ఏమౌతాయో ఆలోచించండి. భూమి తన చుట్టూ తాను తిరగడానికి 24 గంటలు పడుతుంది," అని ఉపన్యాసం మొదలుపెట్టింది.

"ఆపు నీ ప్రసంగం, లేకపోతే నీ తల నరికించేస్తా," అంది యువరాణి.

ఇది విని వంటామె ఎక్కడ గొడ్డలి తెస్తుందో అని ఆందోళనతో చూసింది ఆలీసు. కానీ వంటామె చారు కలపడంలో హడావిడిగా ఉండడం వల్ల ఇదేమీ వినిపించుకోలేదు. అందువల్ల ఆలీసు "మళ్లీ 24 గంటలా లేక 12 గంటలా..." అని పైకి అంటూ ఉండగా.....

"నన్ను నీ పిచ్చి లెక్కలతో విసిగించకు. నాకు లెక్కలంటే అసలు పడదు," అంటూ యువరాణి లాలిపాట పాడడం మొదలుపెట్టింది; ప్రతి చరణం చివర బాబును గట్టిగా ఊపుతోంది:

*"పిల్లవాడితో కరకుగా మాట్లాడు*
*తుమ్మినప్పుడల్లా రెండు దెబ్బలు వెయ్యి*
*నిన్ను విసిగించడానికే తుమ్ముతాడు*
*నిన్ను ఏడిపిస్తున్నానని వాడికి తెలుసు."*

బృందగానం
(దీంట్లో వంటామె, బాబు ఉన్నారు)
***"ఓయ్! ఓయ్! ఓయ్!"***

ఇలా పాడుకుంటూ యువరాణి ఆ చంటిపిల్లాడిని కిందికీ మీదకీ

ఎగరేస్తూ ఆనందించడం మొదలుపెట్టింది.

*"పిల్లవాడితో కరుకుగా మాట్లాడాను*
*తుమ్మినప్పుడల్లా రెండు దెబ్బలు వేశాను*
*మిరియాల ఘాటును మజాగా*
*కావలసినప్పుడల్లా ఆస్వాదించవచ్చుగా!"*

బృందగానం
*"ఓయ్! ఓయ్! ఓయ్!"*

కొంతసేపటి తరవాత "కాసేపు ఈ చంటి పిల్లాడిని నువ్వు చూసుకో. నేను రాణీగారితో బంతాట ఆడాలి," అంటూ ఆలీసుకి ఆ పిల్లాడిని ఇచ్చి వెళ్లిపోయింది యువరాణి. యువరాణి వెళ్లినవైపు ఒక పళ్లాన్ని విసిరింది వంటామె. ఆ పళ్లెం యువరాణికి తగలకుండా కొద్దిలో తప్పిపోయింది.

ఆ పిల్లవాడు వింత ఆకారంలో ఉండి కాళ్లూ, చేతులూ అన్నివైపులకీ విసురుతుండటంతో అతడిని ఎత్తుకోవడం ఆలీసుకి కష్టమైపోతోంది. పట్టుకున్నప్పుడల్లా పిల్లవాడు ఆవిరి యంత్రంలాగా కూతలు పెడుతున్నాడు. బాబు ముడుచుకుంటూ, సాగదీసుకుంటూ కొద్ది క్షణాలసేపు ఆలీసుకి ఊపిరి సలపకుండా చేసేశాడు.

పిల్లవాడిని ఎలా ఎత్తుకోవాలో తెలిసిన తరవాత (మెలేసి మళ్లీ విప్ప తీసుకోకుండా కుడిచెవి, ఎడమకాలు కలిపి పట్టుకోవాలి) అతడిని ఆలీసు ఆరుబయట గాలిలోకి తీసుకెళ్లింది. 'ఈ పిల్లవాడిని నాతో తీసుకెళ్లకపోతే ఒకటి, రెండు రోజుల్లో వీళ్లు చంపేయటం ఖాయం,' అనుకుంది ఆలీసు. "మరి వదిలిపెట్టి వెళితే హత్యా పాతకం," చివరి మాటలు పైకే అనేసింది. ఆ మాటలకు జవాబుగా పిల్లవాడు గుర్రుమన్నాడు (ఆపాటికి పిల్లవాడి తుమ్ములు ఆగిపోయాయి). "అలా గుర్రుమనొద్దు. అది మర్యాద కాదు," అంది ఆలీసు.

పిల్లవాడు మళ్లీ గుర్రుమనటంతో, ఆందోళనతో అతడి ముఖంలోకి చూసింది. అతడి ముక్కు నిజం ముక్కులాగా కాకుండా పైకి తిరిగి ముట్టెలాగా

ఉంది. కళ్లు కూడా చిన్నపిల్లవాడి కళ్లులా కాకుండా చాలా చిన్నగా ఉన్నాయి. మొత్తానికి అతడి ముఖం ఆలీసుకి అసలు నచ్చలేదు. 'ఏడుస్తున్నందువల్ల ముఖం అలా ఉందేమో,' అనుకుంది ఆలీసు. కళ్లల్లో నీళ్లు ఉన్నాయేమోనని అతడి ముఖంలోకి మళ్లీ చూసింది.

కానీ పిల్లవాడి కళ్లల్లో నీళ్లు లేవు. "నువ్వు పందిలాగా మారితే నీతో నాకు ఎటువంటి సంబంధం ఉండదు, జాగ్రత్త!" కోపంగా అంది ఆలీసు. పాపం పిల్లవాడు మళ్లీ ఏడ్చాడు (లేదా గుర్రుమన్నాడు. ఏదో చెప్పటం కష్టంగా ఉంది). కాసేపు నిశ్శబ్దంగా నడుచుకుంటూ వెళ్లారు.

'ఇంటికి వెళ్లిన తరవాత ఈ వింత జీవితో ఏం చేయాలి?' అని ఆలీసు అనుకుంటూ ఉండగా పిల్లవాడు పెద్దగా గుర్రుమన్నాడు. ఆలీసు



అతడి ముఖంలోకి భయం, భయంగా చూసింది. ఈసారి చేతిలో ఉంది పందే అనటంలో అనుమానం ఎంతమాత్రం లేకపోయింది. దానిని ఇంకా ఎత్తుకోవటం సరికాదనిపించింది.

దానిని మెల్లగా కిందకి దించింది. అది గునగునా నడుచుకుంటూ అడవిలోకి వెళ్లిపోవటంతో ఆలీసు హాయిగా ఊపిరి తీసుకుంది. 'పెద్దయిన తరవాత వికారమైన పిల్లవాడు అయి ఉండేది; కానీ ఎంతో అందమైన పందిగా మారి ఉండేది,' అనుకుంది ఆలీసు. తనకు తెలిసిన మరికొంత మంది పిల్లల్ని మార్చటం ఎలాగో తెలిస్తే అందమైన పంది పిల్లలు అవుతారు అనుకుంది. తనకి కొంచెం దూరంలో ఒక కొమ్మ మీద కూర్చుని ఉన్న జాతిపిల్లిని చూసి ఆలీసు ఉలిక్కి పడింది.

ఆలీసుని చూసి నోరు సాగదీసుకుని నవ్వింది పిల్లి. ఆ పిల్లి మంచి పిల్లిలా అనిపించింది ఆలీసుకి. కానీ దాని పెద్ద గోళ్లని చూసి, దీనితో మర్యాదగా ఉండాలి అనుకుంది.

నెమ్మదిగా ఆ పిల్లి దగ్గరకు వెళ్లి "పిల్లీ! పిల్లీ! నేను ఎటు వెళ్లాలో చెప్పగలవా?" అని అడిగింది.

"నువ్వు ఎక్కడికి వెళ్లాలనుకుంటున్నావో దాని మీద ఆధారపడి ఉంటుంది," అంది పిల్లి.

"అదేం ఫరవాలేదులే..." అంది ఆలీసు.

"అలా అయితే ఏ దారిన వెళ్లినా ఒకటే," అంది పిల్లి.

"అదికాదు, నేను ఎక్కడికో ఒక చోటుకి చేరాలి," అంది ఆలీసు.

"అయితే చాలా దూరం నడిస్తే, ఎక్కడో ఒకచోటుకి తప్పకుండా చేరతావు," అంది పిల్లి.

దీనిని కాదనలేక "అక్కడ ఎటువంటి మనుషులు ఉంటారు?" అని మరొక ప్రశ్న సంధించింది ఆలీసు.

దానికి జవాబుగా "ఇటు పక్కగా వెళితే టోపీలవాడు, అటు పక్కగా వెళితే కుందేలు ఉంటారు. అయినా ఆ ఇద్దరిలో ఎవరిని చూసినా ఒకటే, ఇద్దరూ పిచ్చివాళ్లే," అంది పిల్లి.

“కానీ నేను పిచ్చివాళ్ల దగ్గరకు వెళ్లదలుచుకోలేదు,” అంది ఆలీసు.

“అలా అయితే నేను నీకు సహాయం చెయ్యలేను. ఇక్కడ అందరూ పిచ్చివాళ్లే. నువ్వూ పిచ్చిదానివే. నేనూ పిచ్చిదానినే,” అంది పిల్లి.

“నాకు పిచ్చి అని నీకెలా తెలుసు?” అంది ఆలీసు.



“నీకు పిచ్చి లేకపోతే నువ్వు ఇక్కడికి వచ్చేదానివి కాదు,” అంది పిల్లి.

దానిని నమ్మకపోయినా “అయితే నీకు పిచ్చి అని ఎందుకు అనుకుంటున్నావు?” అంది ఆలీసు.

“చెబుతాను విను,” అంది పిల్లి. “కుక్కకి పిచ్చిలేదు, అవునా?” అంది.

“అయి ఉండవచ్చు,” అంది ఆలీసు.

"అలా అయితే కుక్కకి కోపం వచ్చినప్పుడు అరుస్తుంది. సంతోషంగా ఉన్నప్పుడు తోక ఊపుతుంది. కానీ నేను కోపంతో ఉంటే తోక ఆడిస్తాను. సంతోషంగా ఉంటే అరుస్తాను, అందుకే నాకు పిచ్చి," అంది పిల్లి.

"దాన్ని పిచ్చి అనను. ముద్దు చెయ్యడం అంటాను నేను," అంది ఆలీసు.

"నీ ఇష్టం వచ్చిన పేరు పెట్టుకో. కానీ నువ్వు రాణీగారితో ఈ రోజు బంతి ఆట ఆడతావా?" అంది పిల్లి.

"రాణీగారితో ఆడడం ఇష్టమే. కానీ నన్ను ఎవ్వరూ పిలవలేదు," అంది ఆలీసు.

"నన్ను అక్కడ చూస్తావు," అంటూ మాయమయింది పిల్లి.

ఇటువంటివాటికి అలవాటుపడి పోయిన ఆలీసు ఏమీ ఆశ్చర్యపోలేదు. 'ఇక్కడ అందరూ వింతమనుషులు. అన్నీ విచిత్రమైన సంఘటనలు,' అని తనలో తాను అనుకుంటూ ఉండగా మళ్లీ ప్రత్యక్షమయ్యింది పిల్లి.

"అడగటం మరిచిపోయాను. పిల్లవాడు ఏమయ్యాడు?" అంది పిల్లి.

అది తిరిగి ప్రత్యక్షం కావటం సహజమైన విషయం మాదిరి, "వాడు పందిలాగా మారాడు," అంది ఆలీసు. "నేనూ అదే అనుకున్నాను," అంటూ మాయమైపోయింది పిల్లి. మళ్లీ వస్తుందేమోనని కాసేపు చూసింది ఆలీసు. తరవాత కుందేలు ఉన్నవైపుకి బయలుదేరింది. 'ఇంతకు ముందు టోపీలవాళ్లని చూశాను. కుందేలును చూడటం ఆసక్తికరంగా ఉంటుంది. అందులో మార్చిలో ఉన్నంత పిచ్చి దానికి ఇప్పుడు ఉండదు,' అని ఆలీసు అనుకుంటూ ఉండగా కొమ్మమీద మళ్లీ ప్రత్యక్షమయ్యింది పిల్లి.

"నువ్వు పంది* అన్నావా లేక అత్తిపండు* అన్నావా?" అని అడిగింది పిల్లి.

"నేను పంది అన్నాను," అంది ఆలీసు. "నువ్వు క్షణక్షణానికి ఇలా వస్తూ, మాయమవుతూ ఉంటే నాకు తల తిరిగిపోతోంది," అంది ఆలీసు.

---

* ఇంగ్లీషులో Pig (పంది) Fig (అత్తిపండు)ల ఉచ్చారణ వల్ల పిల్లికి ఆ అనుమానం వచ్చింది.

"సరే!" అంటూ ఈసారి నెమ్మదిగా మాయమయింది పిల్లి. తోకనుంచి నిదానంగా మాయం అవటం మొదలుపెట్టి చివరికి దాని నవ్వు మాయమయ్యింది.



'నవ్వులేని పిల్లిని చూశాను,' అనుకుంది ఆలీసు. 'కానీ పిల్లిలేని నవ్వును చూడటం జీవితంలోని అరుదైన వింత!'

ఎంతో దూరం నడవకుండానే 'మార్చి కుందేలు' ఇల్లు వచ్చింది. అది చాలా పెద్ద ఇల్లు. దాని మీద ఉన్న చిమ్నీలు కుందేలు చెవుల ఆకారంలో ఉన్నాయి. ఆ ఇంటి కప్పు పెంకులకు బదులుగా, బొచ్చుతో చేసి ఉంది. అదేమిటో చూడాలని తన ఎడమచేతిలో ఉన్న పుట్టగొడుగుని కొంచెం తిని రెండు అడుగుల పొడవైంది. అంత పెరిగినా కూడా ఆ ఇంట్లోకి ప్రవేశించడానికి భయపడింది. 'ఈ మార్చి కుందేలుకి కూడా పిచ్చి ఉందేమో! ఆ టోపీల వాడి దగ్గరకే వెళ్లాల్సింది,' అనుకుంది ఆలీసు.

# వింత విందు

ఆ ఇంటి ముందు చెట్టుకింద ఒక బల్ల, కొన్ని కుర్చీలు వేసి ఉన్నాయి. అక్కడ 'మార్చి కుందేలు', టోపీలవాడు కూర్చుని తేనీరు తాగుతున్నారు. వాళ్ల మధ్య చుంచెలుక పడుకుని ఉన్నాడు. 'మార్చి కుందేలు', టోపీలవాడు వాళ్ల మోచేతులు బల్లమీద మోపి కబుర్లు చెప్పుకుంటున్నారు. 'పాపం! ఆ చుంచెలుకకు చాలా కష్టంగా ఉండి ఉంటుంది. అయినా ఆ చుంచెలుక నిద్రపోతూ ఉండడం వల్ల ఏమీ తెలియకపోయి ఉండవచ్చు,' అనుకుంది ఆలీసు.

ఆ బల్ల పెద్ద బల్లే, అయినా ముగ్గురూ బల్ల చివరకు గుమిగూడి కూర్చున్నారు. ఆలీసును చూడడంతో వాళ్లు ఏక కంఠంతో "ఇక్కడ ఏమీ జాగా లేదు నీకు," అన్నారు. "ఇక్కడ చాలా జాగా ఉంది," అంటూ ఆలీసు ఒక కుర్చీని తనవైపు జరుపుకుంటూ కూర్చుంది.

కొంచెం కాఫీ పుచ్చుకోమన్నాడు 'మార్చి కుందేలు'.

ఆ బల్లమీద కాఫీ లేకపోవడంతో, "ఇక్కడ 'టీ' తప్ప కాఫీ లేదే," అంది ఆలీసు.

"అవును లేదు," అన్నాడు 'మార్చి కుందేలు'.

"అలా అయితే కాఫీ తాగు అనడం ఏం మర్యాద?" అని ప్రశ్నించింది ఆలీసు.

"మేం పిలవకుండానే నీ అంతట నువ్వు వచ్చి కూర్చోవడం కూడా మర్యాద కాదు కదా!" అన్నాడు 'మార్చి కుందేలు'.

"ఈ బల్ల నీదని నాకు తెలీదు, అయినా ఈ బల్ల దగ్గర ముగ్గురు కంటే ఎక్కువ మంది కూర్చోడానికి సరిపోయినన్ని కుర్చీలు వేసి ఉన్నాయి కదా," అంది ఆలీసు.

"నీ జుత్తును చక్కగా కత్తిరించాలి," అన్నాడు టోపీలవాడు ఆలీసు వైపు ఆసక్తిగా చూస్తూ.

"అలా ఒకరి వ్యక్తిగత విషయాలలో జోక్యం చేసుకోవటం సరైనది కాదు," అంది ఆలీసు కోపంగా.

అలా అనడంతో పూర్తిగా కళ్లు తెరిచాడు టోపీలవాడు. కొంతసేపటికి "రాత బల్లలా కాకి ఎందుకు ఉంటుంది," అనిమాత్రం అన్నాడు.

"ఆహా! చూడబోతే మీరు ఏదో పొడుపు కథలు అడుగుతున్నట్లున్నారు. అయితే నేనూ ప్రయత్నిస్తాను. ఈ పొడుపుకథ విప్పుతాను," అంది ఆలీసు.

"దానికి జవాబు చెప్పగలనని అనుకుంటున్నావా?" అంది 'మార్చి కుందేలు'.

"అనుకుంటున్నాను," అంది ఆలీసు.

"అయితే నువ్వు అనుకున్నదే చెప్పాలి," అంది మార్చి కుందేలు.

"అవును... కనీసం నేను అన్నదే అనుకుంటాను. ఆ రెండూ ఒకటే," అంది ఆలీసు.

"అవి రెండూ ఒకటి కావు," అన్నాడు టోపీలవాడు. "ఉదాహరణకు 'నేను తినేది చూశాను,' అన్నదీ 'నేను చూసినదల్లా తింటాను,'* అన్నదీ ఒకటే అని అనవచ్చు నువ్వు."

దానికి మార్చి కుందేలు " 'నాకు దొరికింది నచ్చుతుంది' అన్నదీ, 'నాకు నచ్చిందే దొరికింది' అన్నదీ కూడా ఒక్కటే అంటావు నువ్వు," అన్నాడు.

" 'నేను పడుకున్నప్పుడు ఊపిరి తీస్తాను' అన్నదీ 'నేను ఊపిరితీస్తూ పడుకుంటాను' అన్నదీ కూడా ఒక్కటే అనవచ్చు," అన్నాడు చుంచెలుక నిద్రలోనే.

"నీకు అన్నీ ఒక్కటే," అన్నాడు టోపీలవాడు. దాంతో ఆ సంభాషణ అక్కడ ఆగింది. ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరించింది. ఆ ప్రశాంత వాతావరణంలో కాకి, రాసుకునే బల్ల గురించి ఆలోచించడం మొదలు పెట్టింది ఆలీసు.

టోపీలవాడు నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ "ఈరోజు తేదీ ఏమిటి?" అన్నాడు ఆలీసు వైపు చూస్తూ. టోపీలవాడు తన చేతివాచీని జేబులోంచి తీసి మధ్యమధ్యలో విదిలిస్తూ చెవిదగ్గర పెట్టుకుని వింటున్నాడు.

---

* ఇంగ్లీషులో 'I see what I eat' లో, 'I eat what I see' లో ఒక పదం మరొక పదంతో స్థానాంతరం చెందడం వల్ల పూర్తి అర్థం మారిపోతుంది. అలాంటివి మరికొన్ని వాక్యాలు ఇచ్చాడు రచయిత.

కొంతసేపు ఆలోచించి "ఇవాళ 4వ తేదీ," అంది ఆలీసు.

"రెండు రోజులు తప్పు," నిట్టూర్చాడు టోపీలవాడు. మళ్లీ "ఆ వెన్న




పనికి రాదని నీకు చెప్పానా!" అన్నాడు మార్చి కుందేలు మీద చిరాకు, కోపం ప్రకటిస్తూ.

"అది మంచి వెన్న," అన్నాడు మార్చి కుందేలు.

"అయి ఉండవచ్చు. కానీ ఆ కత్తితో పెట్టినప్పుడు కొన్ని నలకలు లోపలికి పోయి ఉండవచ్చు," అన్నాడు టోపీలవాడు.

మార్చి కుందేలు ఆ గడియారాన్ని తీసుకుని, చూసి తేనీటిలో ముంచి "అది మంచి వెన్న," అని మరొకసారి అన్నాడు.

ఆ గడియారాన్ని వింతగా చూసి, తన ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ, "భలేగా ఉంది! ఈ గడియారం తేదీలు చూపుతోంది కాని, సమయాన్ని చూపటం లేదే," అంది ఆలీసు.

"గంటలని ఎందుకు చెప్పాలి? నీ గడియారం ఏ సంవత్సరమో చెపుతుందా?" అన్నాడు టోపీలవాడు.

"చెప్పదు. ఎందుకు చెప్పాలి? సంవత్సరం అంటే చాలా రోజులు. అందువల్ల చెప్పవలసిన అవసరం లేదు," అంది ఆలీసు.

"నా విషయంలో కూడా అదే," అన్నాడు టోపీలవాడు.

ఆలీసుకు ఇదంతా అర్థంలేని గొడవగా అనిపించింది. "మీరు మాట్లాడుతున్న భాష, సందర్భం నాకేమీ అర్థం కావడం లేదు," అని మర్యాదగా చెప్పింది ఆలీసు.

"చుంచెలుక మళ్లీ నిద్రపోయాడు," అంటూ, చుంచెలుక ముక్కుమీద వేడి టీ పోశాడు టోపీలవాడు.

కళ్లు తెరవకుండానే, తలమీద నీటిని దులుపుకుంటూ "నేను కూడా అదే అనబోతున్నాను," అన్నాడు చుంచెలుక.

ఆలీసువైపు చూస్తూ "నువ్వు ఆ పొడుపు కథకి జవాబు ఆలోచించావా?" అని ప్రశ్నించాడు టోపీలవాడు.

"లేదు. నేను ఇంక ఆలోచించలేను. జవాబు నీకు తెలుసా?" అంది ఆలీసు.

"నాకు ఏ మాత్రం తెలియదు," అన్నాడు టోపీలవాడు.

"నాకు కూడా తెలియదు," అన్నాడు మార్చి కుందేలు.

"అర్థంలేని, జవాబులేని ఇటువంటి పొడుపు కథలతో మీ కాలాన్ని వృధా చేయడం కంటే, వేరేదైనా మంచి పని చేయలేరా," తన విచారాన్ని ప్రకటిస్తూ ఆలీసు అంది.

"కాలం గురించి నాకు తెలిసినంత నీకు తెలిస్తే కాలాన్ని వృధా పరచడం గురించి మాట్లాడేదానివి కావు," అన్నాడు టోపీలవాడు.

"నువ్వు మాట్లాడుతున్నది ఏమిటో నాకు ఏమాత్రం అర్థం కావడం లేదు," మళ్లీ అంది ఆలీసు.

"అవును, నేను మాట్లాడేదేదీ నీకు అర్థం కాదు. నువ్వు ఎప్పుడూ కాలంతో మాట్లాడి ఉండవు," అన్నాడు టోపీలవాడు.

"అయి ఉండవచ్చు," అంది ఆలీసు తగు జాగ్రత్తతో. "కానీ సంగీతం

వాయించేటప్పుడు కాలం స్పృహ* ఉండాలని తెలుసు," అని కొంత ధైర్యంతో అంది ఆలీసు.

"అలా చెప్పు," అన్నాడు టోపీలవాడు. "నువ్వు కాలాన్ని వాయిస్తే* కుదరదు. నువ్వు స్నేహంగా ఉంటే కాలంతో ఏమైనా చెయ్యవచ్చు. ఉదాహరణకు ఇప్పుడు ఉదయం 9 గంటలు అయిందనుకో, ఇది పాఠాలు మొదలుపెట్టాల్సిన సమయం. అప్పుడు నువ్వు స్నేహంగా ఉన్నట్లయితే కాలం చిటికలో మధ్యాహ్నం ఒకటిన్నర అంటే భోజన సమయం అయిపోతుంది," అన్నాడు టోపీలవాడు. "నేనూ అలాగే అనుకుంటాను," అన్నాడు మార్చి కుందేలు.

"అది అద్భుతంగా ఉంటుంది. కానీ నాకు ఆకలి వెయ్యదే," అంది ఆలీసు.

"మొదట్లో ఆకలి వెయ్యదు. కానీ నువ్వు కావలసినంతసేపు కాలం ఒకటిన్నర గానే ఉంటుంది," అన్నాడు టోపీలవాడు.

"మరి నువ్వు అలా చేస్తావా," అని అడిగింది ఆలీసు.

టోపీలవాడు వెంటనే విచారంగా "లేదు," అంటూ తన తల ఊపాడు. "కిందటి మార్చి నెలలో రాణిగారింట్లో పాట కచేరీలో మేం దెబ్బలాడుకున్నాం. అక్కడ నేను పాట పాడవలసి వచ్చింది. రెండు చరణాలు పాడానో లేదో రాణీగారు "అయ్యో వాడు కాలాన్ని ఖూనీ చేస్తున్నాడు! వాడి తల నరికెయ్యండి," అంటూ అరిచారు.

"అయ్యో! ఎంత దారుణం!" అంది ఆలీసు.

"అప్పటినుండి నాకూ, కాలానికీ ఏమాత్రమూ పడదు. నేనేం అడిగినా కాలం చెయ్యదు. నా విషయంలో ఎప్పుడూ 6 గంటలే."

"అదా సంగతి. అందుకనా ఇన్ని తేనీటి పాత్రలు ఉన్నాయి ఇక్కడ," అంది ఆలీసు.

---

* ఇంగ్లీషులో time అంటే కాలం, సంగీతంలో beating time అంటే శృతి, లయ జ్ఞానం ఉండడం. కానీ beat అంటే కొట్టడం అని కూడా అర్థం ఉంది.



"అవును," అన్నాడు టోపీలవాడు. "ఎప్పుడూ తేనీటి కాలమే మాకు. మధ్యలో గిన్నెలు తోముకునేందుకు కూడా సమయం లేదు." "అందుకే ఒక చోటునుంచి మరొక చోటుకి మారుతూ ఉంటారన్నమాట," అంది ఆలీసు.

"అవును," అన్నాడు టోపీలవాడు.

"కానీ కొన్ని రోజులకు మళ్లీ మొదటికొస్తారుగా," అంది ఆలీసు.

"మనం ఇంకేమైనా విషయాల గురించి మాట్లాడుకుందామా?" అన్నాడు మార్చి కుందేలు ఆవులిస్తూ. "ఆ ప్రస్తావన విసుగు వేస్తోంది. కానీ ఆలీసు ఏదైనా కథ చెపితే బాగుంటుంది."

"నాకు కథలేమీ రావు," అంది ఆలీసు కంగారుగా.

"అయితే చుంచెలుక చెపుతాడు కథ," అని ఇద్దరూ అరిచారు. "లే!

నిద్రనుంచి లే!" అంటూ వాళ్లు చుంచెలుకని రెండు వైపులా గిల్లారు.

ఎలుక మెల్లగా కళ్లు తెరుస్తూ "నేనేమీ నిద్రపోవడం లేదు. మీ మాటలన్నీ వింటూనే ఉన్నాను," అన్నాడు.

"అయితే ఒక కథ చెప్పు," అన్నాడు టోపీలవాడు.

ఆలీసు కూడా "అవును ఒక కథ చెప్పు," అంది.

"త్వరగా ప్రారంభించు, లేకపోతే మళ్లీ నువ్వు నిద్ర పోతావు," అన్నాడు టోపీలవాడు.

"అనగా అనగా ఒక ఊళ్లో ముగ్గురు అక్కచెల్లెళ్లు ఉన్నారు," అంటూ మొదలుపెట్టాడు చుంచెలుక. "వాళ్ల పేర్లు ఎల్సీ, లేసీ, టిల్లీలు. వాళ్లు ఒక నూతిలో నివసిస్తూ ఉండేవారు..."

"అయితే వాళ్లు ఏం తినేవాళ్లు?" ఎప్పుడూ తినటం గురించి ఆలోచించే ఆలీసు అడిగింది.

రెండు నిమిషాలు ఆలోచించి, "బెల్లంనీళ్లు," అన్నాడు చుంచెలుక.

"ఆహా! అది నిజమై ఉండదు. అలా చేస్తే వాళ్లకి రోగాలు వచ్చేవి," అంది ఆలీసు.

"అవును. అదే అయింది," అన్నాడు చుంచెలుక.

నూతిలో నివసించడం ఎలా ఉంటుందో ఆలోచిస్తూ "వాళ్లు నూతిలో ఎందుకున్నారు?" అని అడిగింది ఆలీసు.

"ఇంకొంచెం తేనీరు తాగు," ఆలీసుతో అన్నాడు మార్చి కుందేలు.

"నేను ఇప్పటివరకు అసలు తాగనేలేదు, ఇంకొంచెం తాగలేను," అంది ఆలీసు కోపంగా.

"కొంచెం తక్కువ తాగలేవు. కానీ, ఏమీ లేనిదానికి ఇంకొంచెం ఎక్కువ తేలికగా తాగవచ్చు," అన్నాడు టోపీలవాడు.

"నీ సలహాలు నాకక్కరలేదు," అంది ఆలీసు.

"ఇప్పుడు వ్యక్తిగత విమర్శలు చేసిందెవరు?" అన్నాడు టోపీలవాడు.

అప్పుడు ఏమనాలో అర్థం కాలేదు ఆలీసుకి. అందుకని కొంచెం తేనీరు కప్పులో పోసుకుని, ఒక రొట్టెముక్కని తీసుకుని చుంచెలుకవైపు తిరిగి చూసి "వాళ్లు నూతిలో ఎందుకున్నారు?" అని అడిగింది ఆలీసు.

చుంచెలుక కొంచెంసేపు ఆలోచించి "అది బెల్లంనీరు నుయ్యి," అన్నాడు.

"బెల్లంనీరు నుయ్యి ఎక్కడా ఉండదు," అంది ఆలీసు కోపంగా. కానీ టోపీలవాడు, మార్చి కుందేలు కలిసి "నువ్వు ఊరుకో! చుంచెలుకని కథ పూర్తి చెయ్యనివ్వు," అన్నారు. అందుకు చుంచెలుక బదులిస్తూ "నేను చెప్పింది నచ్చకపోతే నువ్వే చెప్పరాదా కథ," అన్నాడు.

"లేదు! లేదు! నువ్వే చెప్పు. మధ్యలో నేనేం మాట్లాడను," అని ఆలీసు అనడంతో మళ్లీ మొదలుపెట్టాడు చుంచెలుక.

"ఆ ముగ్గురు అక్కచెల్లెళ్లూ బొమ్మలు తోడటం* నేర్చుకుంటున్నారు," అని చెపుతూ ఉండగా, "ఏం తోడటం నేర్చుకున్నారు?" తను ఇచ్చిన మాటను మరచిపోయి అడిగింది ఆలీసు.

"బెల్లంనీళ్లు," అన్నాడు చుంచెలుక, ఆలీసును నిర్లక్ష్యపరుస్తూ.

"నాకు కడిగిన కప్పు కావాలి," అన్నాడు టోపీలవాడు. "అందరం ఒక చోటు మారదాం," అలా అంటూనే అతడు పక్క కుర్చీలోకి జరిగాడు.

చుంచెలుక అతడిని అనుసరించాడు. చుంచెలుక ఖాళీ చేసిన కుర్చీలోకి మార్చి కుందేలు మారాడు. ఆలీసుకి ఇదేమీ నచ్చలేదు. మార్చి కుందేలు అప్పుడే తన పళ్లంలో ఒక కప్పు పాలు ఒలకబోశాడు.

చుంచెలుకకు ఎక్కడ కోపం వస్తుందోనని సందేహిస్తూనే మెల్లగా అడిగింది ఆలీసు: "కానీ బెల్లంనీళ్లు ఎక్కడనుంచి తోడుతున్నారో నాకు అర్థం కాలేదు."

"నీటి బావినుంచి నీళ్లను తోడతారుకదా," టోపీలవాడు చెప్పసాగాడు; "అలాగే బెల్లపునీళ్ల బావినుంచి బెల్లపునీళ్లు తోడతారు. ఆమాత్రం తెలియదా మొద్దు."

"కానీ వాళ్లు బావి*లోనే ఉన్నారుకదా," చివరిమాటలు వినిపించుకోని చుంచెలుకతో అంది ఆలీసు.

"అవును ఉన్నారు," అన్నాడు చుంచెలుక, "బాగానే ఉన్నారు*."

---

* ఇంగ్లీషులో to draw అంటే బొమ్మలు గియ్యడం, నీళ్లు తోడడం అని రెండు అర్థాలు ఉన్నాయి.

* ఇంగ్లీషులో well అంటే బావి అనీ, బాగుండడం అనీ రెండు అర్థాలు ఉన్నాయి.

ఈ సమాధానంతో పాపం ఆలీసు పూర్తి గందరగోళంలో చిక్కుకు పోయింది. మధ్యలో అడ్డుపడకుండా చుంచెలుకను కథ చెప్పనిచ్చింది.

"వాళ్లు బొమ్మలు గీయడం నేర్చుకుంటున్నారు," అన్నాడు చుంచెలుక ఆవులిస్తూ, సగం కళ్లు నులుముకుంటూ "అన్ని రకాల బొమ్మలు గీశారు. అన్నీ 'మ'తో ప్రారంభం అయినవి."

" 'మ'తో ప్రారంభమయినవి ఎందుకు?" అని ప్రశ్నించింది ఆలీసు.

" 'మ'తో ఎందుకు మొదలుకాకూడదు?" అన్నాడు మార్చి కుందేలు.

ఆలీసు నిశ్శబ్దంగా ఊరుకుంది.

చుంచెలుక మళ్లీ నిద్రపోవడం మొదలుపెట్టాడు. టోపీలవాడు చుంచెలుకను గిల్లటంతో కీచుమని అరుస్తూ లేచి కథ చెప్పసాగాడు. "వాళ్లు మజ్జిగను గీశారు, మంచాలని గీశారు," అని అంటూ, "నువ్వు ఎప్పుడైనా మజ్జిగ బొమ్మను చూశావా?" అని అడిగాడు ఆలీసుని.



“నన్ను అడుగుతున్నావా? నేనెప్పుడూ చూడలేదు,” అంది ఆలీసు.

“అయితే నువ్వు మాట్లాడకు,” అన్నాడు టోపీలవాడు.

అలా మంచీ మర్యాదా లేకుండా మాట్లాడడం ఆలీసుకి ఏమాత్రం నచ్చలేదు. అందువల్ల కోపంతో ఆలీసు లేచి వెళ్లిపోయింది. చుంచెలుక వెంటనే నిద్రపోవడం మొదలుపెట్టాడు. ఆలీసు తనను ఎవరైనా వెనక్కి పిలుస్తారేమో అని ఆశతో తిరిగి చూసింది. కానీ మిగిలిన ఇద్దరూ ఆమెను పట్టించుకోలేదు. ఆఖరిసారి చూసినప్పుడు చుంచెలుకను తేనేటి పాత్రలో ముంచటానికి మార్చి కుందేలు, టోపీలవాడు ప్రయత్నిస్తున్నారు.

వాళ్లు పిలిచినా మళ్లీ అక్కడికి వెళ్లకూడదు అని నిర్ణయించుకుంది. ఆ తేనీటి విందు చెత్త విందు అని నిర్ధారణ చేసుకుంది.

ఇలా అనుకుంటూండగా, ఒక తలుపు ఉన్న చెట్టును చూసింది ఆలీసు. ‘చాలా ఆశ్చర్యంగా ఉందే,’ అనుకుంది. కొంతసేపు తటపటాయించి తలుపు తెరిచి లోపలికి వెళ్లింది.

మళ్లీ ఆలీసు మొదటిసారి తాను వెళ్లిన పెద్ద గదిలోకి వెళ్లింది. పొడవాటి గదిలో చిన్న గాజుబల్ల ఉంది. ‘ఈసారి జాగ్రత్తగా ఉండాలి,’ అనుకుంది. అక్కడ ఉన్న బంగారు తాళంచెవిని తీసుకుని ఒక తలుపును తెరిచింది. ఆ తలుపు ఉద్యానవనంలోకి దారి తీసింది. తన జేబులో ఉన్న పుట్టగొడుగుని కొంచెం, కొంచెం తింటూ ఒక అడుగు ఎత్తు పెరిగింది. ఆ చిన్న తోవగుండా నడుచుకుంటూ వెళ్లి చివరికి అందమైన తోటలోకి ప్రవేశించింది. ఆ తోటలో అందమైన పూల మడులు, నీటి గుమ్మటాలు ఉన్నాయి.

# రాణీగారి క్రీడారంగం

అక్కడ ఉన్న పెద్ద గులాబి మొక్కకు తెల్లని గులాబీ పువ్వులున్నాయి. ముగ్గురు తోటమాలులు ఆ తెల్ల గులాబి పువ్వులకు ఎర్ర రంగు వేస్తున్నారు. ఈ సంఘటన ఆలీసుకి వింతగా అనిపించింది. వాళ్ల దగ్గరకు వెళుతున్న ఆలీసుకు "ఐదూ*! అలా రంగు నామీద వేయకు," అనడం వినిపించింది.

"నేను కావాలని రంగు పూయడంలేదు. ఏడు* నా చెయ్యిని కదపటం వల్ల రంగు ఒలికింది," అన్నాడు ఐదు.

"అవును. అవతల వాళ్లమీద తప్పులు తోయడం నీకు అలవాటే కదా ఐదు!" అన్నాడు ఏడు.

"నువ్వు మాట్లాడకు, నీ తల తీయించెయ్యాలని రాణిగారు అనడం నేను స్వయంగా విన్నాను," అన్నాడు ఐదు.

"ఎందుకు?" అన్నాడు ముందుగా మాట్లాడినవాడు.

"అది నీకు అనవసరం, రెండూ," అన్నాడు ఏడు.

"అతనికి అది అవసరం. నేను చెబుతాను. వాడు ఉల్లిపాయలకు బదులు లిల్లీ దుంపలను వంటవాడికి ఇచ్చాడు," అన్నాడు ఐదు.

ఏడు తన బ్రష్షును పడేసి ఏదో చెప్పబోతూ ఉండగా వాడి కళ్లు ఆలీసు మీద పడ్డాయి. ఆలీసు వాళ్లనే చూస్తూ ఉండటంతో అతడు తనను తాను తమాయించుకున్నాడు. మిగిలిన ఇద్దరూ ఆలీసుని చూశారు. వెంటనే వంగి ఆలీసుకు ప్రణామం చేశారు.

కొంత తటపటాయిస్తూ "మీరు తెల్ల గులాబీలకు ఎరుపు రంగును ఎందుకు వేస్తున్నారు?" అని అడిగింది ఆలీసు.

ఐదు, ఏడు మౌనంగా రెండువైపు చూశారు. "ఇక్కడ అసలు ఎర్ర గులాబి చెట్టు వెయ్యవలసింది, పొరపాటున తెల్ల గులాబి చెట్టు వేశాం.

---

* ఇవి పేకలోని ముక్కలు.

రాణీగారికి మేం చేసిన తప్పు తెలిస్తే మా తలలు తీయించేస్తారు. అందుకే మాకు చేతనైనది చేస్తున్నాం...” మెల్లగా అన్నాడు రెండు.



ఇంతలో బాటవంక ఆందోళనతో చూస్తూ “రాణీగారు! రాణీగారు!” అంటూ అరిచాడు ఐదు. ముగ్గురు తోటమాలులూ నేలమీద సాగిలపడ్డారు. అడుగుల చప్పుడు దగ్గర పడుతుండడంతో ఆలీసు రాణీగారిని చూడాలని తిరిగింది.

ముందుగా గద*లు మోసుకుంటూ పదిమంది సైనికులు వచ్చారు. వీళ్లంతా తోటమాలుల మాదిరి పొడవుగా, సన్నగా ఉండి కాళ్లూ, చేతులూ మూలలకు ఉన్నాయి. ఆ తరవాత పదిమంది సభికులు వచ్చారు. వీళ్లు డైమండ్ల*తో అలంకరింపబడి ఉండి సైనికుల మాదిరి ఇద్దరిద్దరు కలిసి వరసలో వస్తున్నారు. ఆ తరవాత రాచకుటుంబాల పిల్లలు వచ్చారు. వాళ్లు పదిమంది ఉన్నారు. వాళ్లు చేతులు పట్టుకుని జతలు, జతలుగా ఎగురుతూ, దూకుతూ వస్తున్నారు. వాళ్లు హృదయా*లతో అలంకరింపబడి ఉన్నారు. ఆ తరవాత అతిథులు వచ్చారు. వాళ్లల్లో ఎక్కువమంది రాజు*లు, రాణు*లు. వాళ్లతోపాటు ఉన్న తెల్ల కుందేలుని ఆలీసు గుర్తుపట్టింది. అది హడావిడిగా, కంగారుగా మాట్లాడుతోంది, ప్రతిదానికీ నవ్వుతోంది. తనని చూడకుండానే అది ముందుకు వెళ్లిపోయింది. ఆ తరవాత ఆటీను* జాకీ* వచ్చింది. ఎర్రటి పట్టు వస్త్రంలో రాజుగారి కిరీటాన్ని అది చేతుల్లో మోసుకొస్తోంది. ఈ గొప్ప ఊరేగింపుకి చివరలో ఆటీను రాజు, రాణీలు ఉన్నారు.

పాపం ఆలీసుకి, తను కూడా నేలమీద సాగిలపడాలో లేదో తెలియలేదు. అయినా తనలో తాను, 'ఈ ఊరేగింపు సంబరాలు చూడకుండా నేలమీద సాగిలపడుకోవడంలో అర్థం లేదు. ఇలా అందరూ పడుకుంటే ఈ ఊరేగింపు ఎందుకు,' అనుకుంది. అందుకే ఆమె అలాగే నిలబడి చూస్తూ ఉండిపోయింది.

ఆ ఊరేగింపు ఆలీసుకి ఎదురుగా వచ్చినప్పుడు అంతా ఆమెనే చూడసాగారు. రాణీగారు "ఎవరది?" అని ఆటీను జాకీని అడిగారు. అతడు

---

* ఇంగ్లీషులో club కి గద అని అర్థం ఉంది, పేకముక్కలలోని clubs ని తెలుగులో కళావరు అంటారు; పేకముక్కలలోని Diamonds (వజ్రం)ని తెలుగులోనూ డైమండ్ అంటారు, Hearts (హృదయం)ని ఆటీను అనీ, Spades (పార)ని 'ఇస్పేటు' అనీ అంటారు.

* పేక ముక్కలలో రాజు, రాణి, జాకీ ఉంటాయి; ఇవి కాకుండా 1 నుంచి 10 అంకెలు ఉంటాయి, ఒకటిని 'ఆసు' అంటారు.

సమాధానం చెప్పకుండా నవ్వుతూ వంగి దండం పెట్టసాగాడు. "వెర్రి వెధవలు," అంటూ ఆలీసు వైపు తిరిగి "నీ పేరు ఏమిటమ్మా?" అని అడిగారు రాణీగారు.

"నా పేరు ఆలీసు, రాణీగారూ!" అని మర్యాదగా బదులిచ్చి, తనలో తాను అనుకుంది, 'వీళ్లంతా పేకముక్కలు మాత్రమే! వీళ్లకి నేను భయపడాల్సిన అవసరం లేదు!'

"ఇలా కింద పడుకున్న వాళ్లందరూ ఎవరు?" అని అడిగారు రాణీగారు, తోటమాలీలను చూపిస్తూ. వాళ్ల ముఖాలు కిందకి ఉండి వెనక భాగం అంతా ఒకే డిజైను ఉండటం వల్ల* వాళ్లు తోటమాలులో, సైనికులో, సభికులో లేక తన పిల్లలేనో రాణీగారు చెప్పలేకపోయారు.

తన ధైర్యానికి ఆశ్చర్యపడుతూ "నాకెలా తెలుస్తుంది, వాళ్లతో నాకు ఏ సంబంధం లేదు," అంది ఆలీసు.

రాణీగారి ముఖం కోపంతో కందగడ్డలా ఎర్రబడింది. ఆమెను పిచ్చి జంతువును చూసినట్టు క్షణంసేపు చూసి "ఆమె తల తీసేయండి," అని ఆజ్ఞాపించారు.

"అసందర్భం," అంది ఆలీసు, పెద్దగానూ, దృఢ కంఠంతోనూ. రాణీగారు నిశ్శబ్దంగా నిలిచిపోయారు.

రాణీగారి చెయ్యిపట్టుకుని "చిన్న పిల్ల, జాలి చూపించు," అన్నారు రాజుగారు భయం భయంగా.

రాణీగారు కోపంతో పక్కకు జరిగి "వాళ్లని తిప్పండి," అని జాకీని ఆజ్ఞాపించారు.

నేలమీద బోర్లాపడి ఉన్న ముగ్గుర్ని కాలితో జాగ్రత్తగా తిప్పారు భటులు.

"లేవండి!" అని పెద్దగా అరిచారు రాణీగారు. దాంతో వాళ్లు ముగ్గురు లేచి రాజుకి, రాణికి, రాచరిక పిల్లలకు, అందరికి దండాలు పెట్టడం మొదలుపెట్టారు.

---

* ఒక పేకల దస్తంలో 52 కార్డులు ఉంటాయి. ఒక దస్తంలోని అన్ని కార్డులకు వెనకవైపు ఒకే డిజైను ఉంటుంది.



“చాలించండి... ఆ దండాలు! మీ ప్రవర్తనతో నాకు మతిపోతోంది ...” అంటూ గులాబి మొక్కలను చూపిస్తూ “మీరంతా ఇక్కడ ఏం చేస్తున్నారు?” అని అడిగారు.

తన మోకాళ్లపై నిలబడి సంగతి అంతా చెపుదామని రెండు ప్రారంభించాడు, “రాణీగారు! మేము...”

గులాబీలను పరిశీలించి, “అదా సంగతి! వీళ్ల ముగ్గురి తలలు తీయించేయండి,” అంటూ రాణీగారు తన పరివారంతో ముందుకు సాగారు. ముగ్గురు తోటమాలుల తలలు తీసివేయడానికి ముగ్గురు భటులు మాత్రం

ఆగిపోయారు. ముగ్గురు తోటమాలులూ రక్షణ కోసం ఆలీసు దగ్గరకు పరిగెత్తారు.

"మీ తలలు తీయబడవు," అంటూ ఆలీసు, ఎవరికీ కనపడకుండా, ఆ ముగ్గురు తోటమాలులను ఒక పూలకుండీలో కూర్చోపెట్టింది. పాపం భటులు తోటమాలుల కోసం కొంతసేపు వెతికారు. వాళ్లు కనపడక పోవడంతో తిరిగి తక్కిన రాజపరివారాన్ని చేరుకున్నారు.

"వాళ్ల తలలు తీశారా?" అని అడిగారు రాణీగారు.

"వాళ్ల తలలు పోయాయి, రాణీగారూ!" అన్నారు భటులు.

సంతోషించిన రాణీగారు "బంతి ఆట ఆడడం తెలుసా?" అన్నారు.

ఆ ప్రశ్న ఆలీసును ఉద్దేశించింది కాబట్టి రాజభటులు ఆలీసు వైపు చూశారు.

ఆలీసు "తెలుసు," అంది బిగ్గరగా.

"అయితే పద!" ఉత్సాహంగా అన్నారు రాణీగారు. ఆ తరవాత ఏం జరుగుతుందో తెలియని ఉత్సుకతతో ఆలీసు ఆ ఊరేగింపులో భాగం అయ్యింది.

"ఈ రోజు చాలా బాగుంది," ఆమె పక్కన ఒక గొంతు మెల్లగా వినిపించింది. ఆలీసు పక్కగా తెల్ల కుందేలు నడుస్తోంది.

"అవును. కానీ యువరాణీగారు ఎక్కడ?" అంది ఆలీసు.

"హుష్! హుష్!" కంగారుగా అంది కుందేలు. ఆ తరవాత భయం భయంగా భుజంమీదనుంచి వెనక్కి చూడసాగింది. తరవాత మునికాళ్లమీద పైకి లేచి ఆలీసు చెవి దగ్గర నోరుపెట్టి, "యువరాణీకి మరణశిక్ష పడింది," అని గుసగుసగా అంది.

"ఎందుకు?" అంది ఆలీసు.

"పాపం అన్నావా?" అంది కుందేలు.

"లేదు. ఇందులో జాలిపడాల్సింది ఏమీలేదు. కానీ ఎందుకు శిక్ష వేశారు అని అడుగుతున్నాను," అంది ఆలీసు.

"రాణీగారి చెవులని వాయించేసింది..." అంది కుందేలు. ఆలీసు

ఫక్కుమని నవ్వింది. "ష్! జాగ్రత్త రాణీగారు వింటారు," భయపడుతూ అంది కుందేలు.

"ఏమయిందంటే యువరాణీగారు ఆలస్యంగా వచ్చారు. అప్పుడు రాణీగారు ఏమన్నారంటే..." అని చెబుతూండగా "అందరూ ఎవరి జాగాల్లోకి వాళ్లు వెళ్లండి," అంటూ ఉరుము ఉరిమారు రాణీగారు. అందరూ అటూ ఇటూ పరిగెడుతూ ఒకళ్లనొకళ్లు పడదోసుకోసాగారు. అయితే రెండు నిమిషాల్లో అందరూ కుదుట పడటంతో ఆట మొదలైంది.



ఆలీసు అటువంటి బంతి ఆటను ఎన్నడూ చూడలేదు. మైదానం అంతా చాళ్లు చాళ్లుగా గతుకులతో ఉంది. బంతికి బదులు ముళ్లపందులు ఉన్నాయి. బంతినికొట్టే కర్రలు నిజమైన ఫ్లెమింగో పక్షులు. సైనికులు వెనక్కి వంగి చేతులు నేలకి ఆనించి బంతిని కొట్టాల్సిన ద్వారంలాగా నిలబడ్డారు.

ఆ ఆట ఎలా ఆడాలో తెలియలేదు. బంతికొట్టే కర్రలా ఫ్లెమింగోని పట్టుకోలేక పోయింది ఆలీసు. దానిని చంకలో ఇరికించుకుని బంతిని కొట్టటానికి కాళ్లను కిందకి ఉంచి మెడను నిటారుగా చేసి దాని తలతో ముళ్లపందిని కొడదామనుకునేటంతలో పక్షి తల ఎత్తి ఆశ్చర్యంగా ఆలీసువంక చూసేది. దాంతో ఆలీసుకి నవ్వు వచ్చేది. ఎలాగో తంటాలుపడి బంతిని కొట్టటానికి సిద్ధపడేసరికి బంతిలా ప్రవర్తించవలసిన ముళ్లపంది ఇష్టం వచ్చినట్లు వెళ్లిపోతూ ఉండేది. అంతేకాకుండా తను బంతి కొట్టాలనుకున్న మార్గంలో కాలవో, లేదా గట్టో అడ్డంగా ఉండేది. పైగా ద్వారంలాగా వంగిన సైనికులు లేచిపోయి మైదానంలోని ఇంకొక చోటుకి వెళ్లిపోతుండేవాళ్లు. చూడగా అది చాలా కష్టమయిన ఆటగా భావించింది ఆలీసు.

అందరూ ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్లు ఆడడం మొదలుపెట్టారు. ఆటగాళ్లు ముళ్లపంది బంతులకోసం ఒకరితో ఒకరు పోట్లాడుకోసాగారు. దాంతో రాణీగారు కోపంతో చిందులు వేస్తూ “అతడి తల నరికేయండి! ఆమె తల నరికేయండి,” అంటూ నిమిషానికొకసారి అరవడం మొదలుపెట్టారు.

ఆలీసుకి ఇదంతా చాలా ఇబ్బందికరంగా అనిపించింది. ‘ఇప్పటివరకు రాణీగారితో తనకి ఏ గొడవా రాలేదు. కానీ గొడవ రావడానికి ఎంతోసేపు పట్టదు. అది ఏ క్షణంలోనైనా జరగవచ్చు. అప్పుడు నాకేం అవుతుందో? ఇక్కడ వాళ్లకి తలలు తీసేయడం చాలా సరదాగా ఉన్నట్లుంది. అలా చేస్తూ ఉంటే ఇక్కడ ప్రజలు ఎంతోమంది బతికి ఉండకూడదు. ఈ లెక్కన ఇక్కడ ఇంతమంది ప్రాణంతో ఉన్నారంటే అదీ ఒక ఆశ్చర్యమే!’ అని అనుకో సాగింది.

అక్కడనుంచి ఎలా బయటపడాలా అని అనుకుంటూండగా గాలిలో ఒక వింత ఆకారం కనపడింది. కాసేపు అదేమిటోనని ఆందోళన పడింది. ఒకటి, రెండు నిమిషాలు తేరిపార చూసిన తరవాత ఒక నవ్వు కనిపించింది. అది ఆలీసు అంతకు ముందు చూసిన ‘జాతి పిల్లి’. ‘అమ్మయ్య! నాకు మాట్లాడుకోవడానికి పిల్లి దొరికింది,’ అని అనుకుంది ఆలీసు.

మాట్లాడటానికి నోరంతా వచ్చిన తరవాత "ఎలా ఉన్నావు?" అని అడిగింది పిల్లి.

కళ్లు కనిపించేదాక ఆలీసు వేచి ఉండి తల ఊపింది. 'చెవులు, కనీసం ఒక చెవి వచ్చేవరకు మాట్లాడి ఏమీ ప్రయోజనం లేదు,' అనుకుంది ఆలీసు. ఒక నిమిషంలో పిల్లి తల మొత్తం కనిపించటంతో ఆలీసు తన చేతిలోని ఫ్లెమింగో పక్షిని కిందపెట్టి ఆట గురించి వివరించటం మొదలుపెట్టింది. తలకాయ కనపడితే చాలనుకుందేమొ పిల్లి అంతకు మించి కనపడటం ఆగిపోయింది.

"ఏమిటో, వీళ్లు ఆడుతున్న ఆట... ఈ ఆటకి ఒక నియమం కానీ ఒక క్రమం కానీ ఉన్నట్లు లేదు," అంది ఆలీసు. "ఏమీ వినపడనంతగా అందరూ గోలగోలగా పోట్లాడుకుంటారు. ఆటకి నియమాలు ఉన్నా ఎవరూ పాటిస్తున్నట్లు లేదు. ఆటవస్తువులన్నింటికి ప్రాణముండటంతో ఎంత గందరగోళంగా ఉంటుందో నువ్వు ఊహించలేవు. ఉదాహరణకు నేను బంతిని కొట్టవలసిన ద్వారం మైదానం ఆ భాగంలో తిరుగుతూ ఉంటుంది. నా బంతితో రాణీగారి బంతిని కొట్టబోయాను, అది చూసిన ఆ ముళ్లపంది లేచి పరుగు తీసింది!"

"రాణీగారు నీకు నచ్చారా?" అంది పిల్లి మెల్లగా.

"నాకేమీ నచ్చలేదు. ఆవిడ చాలా..." అని ఏదో చెప్పబోతూండగా, రాణీగారు తన పక్కన కనపడడంతో మాట మార్చి, "...బాగా ఆడుతున్నారు. రాణీగారు ఈ ఆటలో గెలిచేట్లున్నారు, ఇంక ఆడడం దండగ," అంది ఆలీసు.

రాణీగారు చిన్న నవ్వు నవ్వి అక్కడ నుండి వెళ్లిపోయారు.

ఆలీసు దగ్గరకు వస్తూ "ఎవరితో మాట్లాడుతున్నావు?" అని అడిగారు రాజుగారు.

పిల్లివైపు కుతూహలంగా చూస్తున్న రాజుగారిని ఉద్దేశించి, "ఈ పిల్లి నా స్నేహితుడు, మీకు పరిచయం చేస్తాను," అంది ఆలీసు.

"దాని ముఖం నాకేమీ నచ్చలేదు. కానీ కావాలంటే అది నా చెయ్యి ముద్దుపెట్టుకోవచ్చు," అన్నారు రాజుగారు.

"నాకేం అవసరంలేదు," అంది పిల్లి.

"అలా అమర్యాదగా ఉండకు, నావైపు అలా చూడకు," అంటూ రాజుగారు ఆలీసు వెనకాల నిలుచున్నారు.

"రాజుగారివైపు పిల్లి చూడవచ్చు అని నేను పుస్తకంలో చదివాను. అది ఏ పుస్తకమో గుర్తులేదు," అంది ఆలీసు.

"ఆ పిల్లి అక్కడి నుండి వెళ్ళిపోవలసిందే!" అన్నారు రాజుగారు. అటుగా వెళుతున్న రాణీగారిని పిలిచి "ఈ పిల్లిని ఇక్కడ నుండి తీయించెయ్యగలవా?" అన్నారు.

సమస్య పెద్దదైనా, చిన్నదైనా రాణీగారికి తెలిసిన పరిష్కారం ఒక్కటే. రాణీగారు చుట్టుపక్కల చూడకుండానే "ఈ తలని నరికేయండి," అన్నారు.

"నేను వెళ్లి భటులను తెస్తాను," అంటూ రాజుగారు గబగబా వెళ్లి పోయారు.

ఆట ఎలా జరుగుతోందో చూడాలని నిశ్చయించుకుంది ఆలీసు. అప్పుడే రాణీగారి అరుపులు వినపడుతున్నాయి. తమ వంతు ప్రకారం ఆడనందుకు ఇంకో ముగ్గురి తలలు తీయించేయండి అని ఆజ్ఞాపించడం వినపడింది. జరుగుతున్నదేదీ ఆలీసుకి నచ్చలేదు. ఆట ఎంత గందరగోళంగా తయారయ్యిందంటే అది తన వంతో కాదో కూడా తెలియటం లేదు ఆలీసుకి. ఆలీసు తన ముళ్ల పంది కోసం వెతకడం మొదలుపెట్టింది.

ఆలీసు ముళ్లపంది, మరో ముళ్లపందితో పోట్లాడుతోంది. బంతికర్రతో కొట్టడానికి ఇదే మంచి సమయమనుకుని చూడగా బంతికర్రలా ఉండవలసిన తన ఫ్లెమింగో తోటలోని అవతలి పక్కన కనపడింది. అది చెట్టుమీదకు ఎగరడానికి ప్రయత్నిస్తోంది.

ఆలీసు వెళ్లి దానిని పట్టుకుని వచ్చేటప్పటికి ముళ్లపందులు దెబ్బలాట మానేసి ఎటో వెళ్లిపోయాయి. 'ఏం పర్వాలేదులే. మైదానం ఇటువైపు ద్వారాలు కూడా లేవు,' అనుకుంటూ ఫ్లెమింగో ఎగిరిపోకుండా తన చంకలో పెట్టుకుని మళ్లీ పిల్లితో మాట్లాడడానికి వెళ్లింది ఆలీసు.

పిల్లి దగ్గర పెద్ద గుంపు గుమిగూడి ఉండటం చూసి ఆశ్చర్యపోయింది ఆలీసు. అక్కడ రాజుగారు, రాణీగారు, పిల్లి తలను నరకడానికి సిద్ధంగా ఉన్న భటుడు దెబ్బలాడుకుంటున్నారు. వాళ్లు ముగ్గురూ ఒక్కసారే మాట్లాడుతున్నారు. తక్కిన వాళ్లంతా మాట్లాడకుండా ఆందోళనతో చూస్తున్నారు.



ఆలీసుని చూడడంతో వాళ్లంతా ఆమెవైపు తిరిగి అందరూ ఒకేసారిగా తీర్పు చెప్పమంటూ జరిగినదంతా చెప్పసాగారు. అందరూ ఒకేసారి మాట్లాడడం వల్ల ఆలీసుకి వాళ్లు చెప్పింది ఏమీ అర్థం కాలేదు.

ఆ పిల్లికి తల తప్ప ఇంక తక్కిన శరీరం లేకపోవడంతో దాని తలను దేని నుండి నరకాలి అన్నది భటుడి వాదన. అతడు అంతకు ముందెప్పుడూ ఇటువంటిది చెయ్యలేదు. ఈ వయసులో కొత్తగా ఇది మొదలుపెట్టడం అతడికి ఇష్టంగా లేదు.

తల ఉన్న ప్రతిదానికి తల నరకవచ్చు, శరీరం అవసరంలేదనీ, పిచ్చిపిచ్చిగా మాట్లాడవద్దన్నది రాజుగారి వాదన.

దీని గురించి వెంటనే ఏదో ఒకటి చేయకపోతే అక్కడున్న వాళ్లందరి తల నరికించివేయిస్తానన్నది రాణీగారి వాదన. (ఈ మాటవల్లే అక్కడ ఉన్న వాళ్లందరి ముఖాల్లో భయం, ఆందోళనలు వ్యక్తం కాసాగాయి.)

ఆలీసుకి ఉపాయమేమీ తట్టకపోవటం వల్ల "ఆ పిల్లి యువరాణిది; కాబట్టి దాని గురించి ఆమెను అడగటం మంచిది," అంది.

"ఆమె చెరసాలలో ఉంది. వెళ్లి ఆమెను తీసుకురా," భటుడిని ఆదేశించింది యువరాణి. అతడు బాణంలాగా దూసుకు వెళ్లాడు.

అతడు అటు వెళ్లాడో లేదో పిల్లి తల మాయం అవ్వటం మొదలు పెట్టింది. భటుడు యువరాణీతో తిరిగి వచ్చేసరికి పిల్లి తల పూర్తిగా మాయమై పోయింది. దాంతో రాజుగారు, తలారి పిల్లిని వెతకడంలో మునిగిపోయారు, మిగిలిన వాళ్లంతా ఆట ఆడడానికి వెళ్లారు.

# నకిలీ తాబేలు కథ

"నిన్ను మళ్లీ చూడగలిగినందుకు ఎంత సంతోషంగా ఉందో చెప్పలేను," అంటూ యువరాణి ఆలీసు చేతిలో చేయి వేసి నడిచింది.

యువరాణి చాలా సరదాగా ఉన్నట్లు ఆలీసుకి కనిపించింది. 'బహుశః మిరియాల పొడి వల్లనేమో అంతకు ముందు యువరాణి అంత కోపంగా ఉంది,' అనుకుంది.

'నేనే యువరాణిని అయితే (అంత ఆశ లేకపోయినా) వంట ఇంట్లో అసలు మిరియాల పొడినే ఉంచను. పులుసు, చారు అన్నీ కారం లేకపోయినా రుచిగానే ఉంటాయి. బహుశః మిరియాలే మనుషుల కోపానికి కారణం అయి ఉంటాయి,' తన సూత్రీకరణతో ఉత్సాహం పొంది ఆ ఆలోచనను కొనసాగించింది ఆలీసు. 'చింతపండు పులుసు మనుషులను పుల్లగా చేస్తుంది, కాకరకాయ వాళ్లని అంతా చేదుగా చేస్తుంది. చక్కెర చిన్నపిల్లలను అంత తీపిగా చేస్తుంది,' అని అనుకుంది ఆలీసు.

యువరాణి తనతో నడుస్తున్నట్లు కూడా మరచిపోయి ఆలోచనలో పడిపోయింది ఆలీసు. ఉన్నట్లుండి "నువ్వు ఏదో ఆలోచిస్తున్నట్లున్నావు అందుకే మాట్లాడటం లేదు," అంటూ యువరాణి మాటలు చెవిదగ్గర వినపడటంతో ఆలీసు ఒక్కసారిగా ఉలిక్కిపడింది. "చూడు ఆలీసు, దీంట్లో నీతి ఏమిటో ఇప్పుడు గుర్తుకు రావటంలేదు కానీ, అది గుర్తుకు రాగానే చెపుతాను."

"బహుశా దాంట్లో నీతి ఏమీ లేదేమొ," అంది ఆలీసు.

"కాదు అమ్మాయి! వెతికితే ప్రతిదాంట్లోనూ నీతి ఉంటుంది," అంటూ ఆలీసుని తనకు దగ్గరగా తీసుకుంది యువరాణి.

యువరాణి తనను అంత దగ్గరగా తీసుకోవడం ఆలీసుకు నచ్చలేదు. మొదటి సంగతి యువరాణి అంత అందంగా లేదు. రెండవ విషయం యువరాణి గడ్డం సరిగ్గా ఆలీసు భుజాన్ని తాకుతోంది. యువరాణి గడ్డం సూదిగా ఉండడంవల్ల అది ఆలీసు భుజానికి తగిలి బాధాకరంగా ఉంది.

అయితే అమర్యాదగా ఉంటుందని ఆ నొప్పిని ఎలాగో భరించింది.

"ఆట ఇప్పుడు బాగానే సాగుతున్నట్లు ఉంది," అంది ఆలీసు.

"అవును, అందులో కూడా నీతి ఉంది. ఆ నీతి ఏమిటంటే ప్రేమ ప్రపంచాన్ని నడిపిస్తుంది," అంది యువరాణి.

"ఎవరి పని వాళ్లు చూసుకుంటే ఈ ప్రపంచం ఎంతో బాగుంటుందని ఎవరో చెప్పారు," గుసగుసగా అంది ఆలీసు.

"నేను చెప్పేది అదే! నువ్వు చెప్పేదాంట్లో నీతి ఏమిటంటే," అంటూ తన గడ్డాన్ని ఆలీసు భుజంలో గుచ్చుతూ "భావాన్ని పట్టించుకుంటే, శబ్దం దానంతటది అదే బాగుంటుంది."

'నీతులు చెప్పడం యువరాణికి ఎంత ఇష్టం,' అనుకుంది ఆలీసు.

"నేను నీ నడుం చుట్టూ చేతులు వేసి నడవడం లేదేమిటి అని అనుకుంటున్నావేమో!" అంది యువరాణి. ఒక్క క్షణం ఆగి "నీ చంకలో ఉన్న పక్షి ఏం చేస్తుందోనని నా చెయ్యి వెయ్యలేదు. ఏమవుతుందో చెయ్యిపెట్టి చూడమంటావా," అంది యువరాణి.

"అది కరుస్తుందేమో?" యువరాణి తన నడుంచుట్టూ చెయ్యి వెయ్యడం ఇష్టంలేని ఆలీసు అంది.

"అది నిజమే! ఫ్లెమింగోలు, ఆవాలు రెండూ కరుస్తాయి. దీని నీతి ఏమిటంటే, ఏ గూటి పక్షులు ఆ గూటికే చేరతాయి," అంది యువరాణి.

"కానీ ఆవాలు పక్షులు కావే!" అంది ఆలీసు.

"నిజం, నువ్వు చాలా తెలివైనదానివి," అంది యువరాణి.

"అది ఒక రకమైన ఖనిజం అనుకుంటాను," అంది ఆలీసు.

"అది ఖనిజమే," అంది యువరాణి. ఆలీసు చెప్పిన ప్రతిదానితో ఏకీభవించడానికి ఆమె సిద్ధంగా ఉన్నట్లు ఉంది. "ఇక్కడకి దగ్గరలో పెద్ద ఆవాల గని ఉంది. దాని నీతి ఏమిటంటే నాది ఎంత ఎక్కువ ఉంటే, నీది అంత తగ్గిపోతుంది."

"ఊఁ! నాకు తెలిసింది. అది ఒక రకమైన మసాలా దినుసు. అది అలా కనబడదు. కానీ అది ఒక రకమైన మసాలా దినుసే," అంది ఆలీసు.



“అవును, నీతో ఏకీభవిస్తున్నాను,” అంది యువరాణి. “దాని నీతి ఏమిటంటే – ‘నువ్వు ఏమిటో అలాగే ఉండు’ – ఇంకా తేలికమాటలో చెప్పాలంటే – ఇతరులకు నువ్వు ఎలా అనిపిస్తావో లేదా అనిపించి ఉండవచ్చో అది నువ్వు ఏమిటో, లేదా ఏమై ఉండవచ్చో కంటే భిన్నమైనదికాదు కాబట్టి నిన్ను నువ్వు మరోలా భావించుకోవద్దు!”

“నువ్వు చెప్పినదంతా ఒక చోట రాసుకుంటే బాగా అర్థం అవుతుందేమొ,” మర్యాదగా అంది ఆలీసు. “నువ్వు చెబుతుండగా దానిని అర్థం చేసుకోవటం కష్టంగా ఉంది.”

“నేను చెప్పాలనుకుంటే ఇంకా చాలానే చెప్పగలను,” సంతోషంగా అంది యువరాణి.

“అలాగని అంతకంటే పెద్ద వాక్యాల్లో చెప్పాలని కష్టపడకు,” అంది ఆలీసు.

“కష్టం అనకు. నేను చెప్పే నీతులన్నీ నీకు బహుమానంగా ఇస్తాను,” అంది యువరాణి.

‘ఎంత గొప్ప బహుమానం! ఇక్కడ వీళ్లు పుట్టినరోజుకి ఇటువంటి బహుమానాలు ఇవ్వకపోవడం బాగానే ఉంది,’ తనలో తాను అనుకుంది ఆలీసు.

“మళ్లీ ఆలోచనలో పడ్డావు కదూ,” అంది యువరాణి గడ్డంతో గట్టిగా పొడుస్తూ.

“ఆలోచించడానికి నాకు హక్కు ఉంది,” కొంత ఆందోళనకు గురికాసాగిన ఆలీసు అంది.

“అవును, పందులకు ఎగరటానికి ఎంత హక్కు ఉందో నీకు అంత హక్కు ఉంది. దీంట్లోని నీ...” అంటూ మధ్యలో ఆగిపోయింది యువరాణి. ఎందుకు ఆగిందా అని చూసేసరికి అక్కడ రాణీగారు చేతులు కట్టుకుని, కళ్లురుముతూ నిలబడి ఉన్నారు.

“నేటి రోజు చాలా బాగుంది,” అంది యువరాణి నెమ్మదిగా.

“నీకు ఇప్పుడే చెపుతున్నాను. ఈ క్షణంలో నీ తలో లేక నువ్వో పోవాలి. ఏం కావాలో నువ్వే తేల్చుకో,” అన్నారు రాణీగారు.

మరుక్షణంలో యువరాణి అక్కడి నుంచి మాయమయ్యింది.

“పద. మనం ఆడుకుందాం,” అంది రాణి ఆలీసుతో. భయంతో బిక్కచచ్చిపోయి ఉన్న ఆలీసు మారు మాట్లాడకుండా రాణీగారిని అనుసరించింది.

రాణీగారు క్రీడారంగంలో లేకపోవడంతో అక్కడ అందరూ నీడలో కూర్చుని ఉన్నారు. రాణీగారిని చూడగానే ఎవరి స్థానాలలోకి వాళ్లు వెళ్లిపోయారు. క్షణం ఆలస్యమైతే ప్రాణాలు పోతాయని రాణీగారు హెచ్చరించారు.

ఆట జరుగుతున్నంతసేపూ రాణీగారు ఎవరో ఒకరితో పోట్లాడుతూనే ఉన్నారు, ‘అతడి తల తీయండి!’, ‘ఈమె తల తీసేయండి,’ అని అరుస్తూనే ఉన్నారు. శిక్షపడిన వాళ్లను సైనికులు బందీలుగా తీసికెళ్లసాగారు. దాంతో

ద్వారాలుగా నిలబడిన వాళ్లు తగ్గిపోసాగారు. అరగంట తరవాత మైదానంలో ఒక్క ద్వారం కూడా లేదు. రాజు, రాణి, ఆలీసు మినహాయించి మిగిలిన ఆటగాళ్లందరూ మరణశిక్ష విధింపబడి ఖైదీలుగా ఉన్నారు.

అప్పుడుదాకా ఊపిరి తీసుకోకుండా హడావిడిగా తిరుగుతున్న రాణీగారు ఆలీసుని "నకిలీ తాబేలుని చూశావా?" అని అడిగారు.

"లేదు, అసలు నకిలీ తాబేలు అంటే ఏమిటో కూడా నాకు తెలియదు," బదులిచ్చింది ఆలీసు.

"దాంతోటి నకిలీ తాబేలు పులుసు చేస్తారు," రాణీగారు అన్నారు.

"నేను అటువంటి దాని గురించి వినలేదు, చూడలేదు," అంది ఆలీసు.

"అయితే పద," అన్నారు రాణీగారు. "అతడు నీకు తన చరిత్ర చెబుతాడు."

వాళ్లు అలా నడుస్తుండగా రాజుగారు మెల్లగా అందరితో "మీ అందరికీ క్షమాభిక్ష పెట్టారు," అనటం వినిపించింది. అప్పటివరకు రాణీగారు విధించిన మరణశిక్షలకు బాధపడుతున్న ఆలీసు ఆ మాటలు విని, 'అమ్మయ్య! మంచిపని జరిగింది!' అనుకుంది.

కొంచెం సేపటికి వాళ్లు ఎండలో నిద్రపోతూ ఉన్న గ్రైఫన్‌ని చేరుకున్నారు. (గ్రైఫన్ అంటే ఏమిటో మీకు తెలియకపోతే తరువాత పేజీలో బొమ్మ చూడండి.) "లే, బద్ధకపు మొద్దా!" రాణీగారు అరిచారు. "ఈ అమ్మాయిని నకిలీ తాబేలు వద్దకు తీసుకెళ్లి అతడి చరిత్ర చెప్పించు. వెనక్కి వెళ్లి నేను ఆదేశించిన మరణశిక్షల సంగతి చూడాలి." గ్రైఫన్‌తో ఆలీసుని ఒంటరిగా వదిలేసి రాణీగారు వెళ్లిపోయారు. ఆ జీవి ఆలీసుకి ఏమాత్రమూ నచ్చలేదు. కానీ ఏ క్షణంలో ఏమి చేస్తుందో తెలియని రాణీగారి వెంట వెళ్లడం కంటే అక్కడ ఉండడమే క్షేమకరం అనుకుంది ఆలీసు.

గ్రైఫన్ లేచి కూర్చుని కళ్లు నులుముకున్నాడు. రాణీగారు కనుమరుగు అయ్యేంతవరకు చూస్తూ ఉండి కిసుక్కుమంటూ నవ్వాడు. "భలే తమాషా!" సగం తనలో తాను, సగం పైకి అన్నట్టుగా అన్నాడు గ్రైఫన్.



"తమాషా ఏమిటి?" అడిగింది ఆలీసు.

"ఆమెనే," అన్నాడు గ్రైఫన్. "అంతా ఆమె కల్పన. నిజానికి ఎవరూ ఎవరికీ మరణశిక్ష అమలు చేయరు. పోదాం పద!"

'ఇక్కడ అందరూ ఆజ్ఞాపించేవాళ్లే. నన్ను ఎప్పుడూ ఎవరూ ఇలా ఆజ్ఞాపించలేదు,' గ్రైఫన్ వెనక మెల్లగా నడుస్తూ అనుకుంది ఆలీసు.

ఎంతో దూరం నడవకుండానే వాళ్లకి నకిలీ తాబేలు కనిపించాడు. అతడు ఒక బండరాతి మీద ఒంటరిగా కూర్చుని విచారంగా ఉన్నాడు. గుండెలు పగిలిపోయేలా అతడు నిట్టూరుస్తూ ఉండడం ఆలీసుకి వినపడుతోంది. "నకిలీ తాబేలు అలా ఎందుకు విచారంగా ఉన్నాడు?" అని గ్రైఫన్‌ని అడిగింది. "వాడు ఎప్పుడూ అలాగే ఉంటాడు. విచారాలన్నీ అతడి కల్పనలే, పద!" అన్నాడు గ్రైఫన్.

కళ్లనిండా నీళ్లు నింపుకుని కూర్చున్న నకిలీ తాబేలు దగ్గరకు వాళ్లు చేరుకున్నారు. అతడు వాళ్లవంక చూస్తున్నాడు కానీ ఏమీ మాట్లాడటం లేదు.

"ఇదిగో, ఈ అమ్మాయి నీ కథ వినడానికి వచ్చింది," అని పరిచయం చేశాడు గ్రైఫన్.

"అయితే కూర్చోండి, నా కథ చెబుతాను. కానీ మీరెవరూ నేను కథ పూర్తి చేసేదాకా మాట్లాడకూడదు," అన్నాడు నకిలీ తాబేలు.

కథను వినడానికి కూర్చున్నారు ఇద్దరూ. కొంచెంసేపటి వరకు ఇద్దరూ ఏమీ మాట్లాడకుండా ఉన్నారు. 'నకిలీ తాబేలు అసలు ఇంకా కథే మొదలుపెట్టకపోతే ఎప్పటికి పూర్తి చేస్తాడు,' అనుకుంది ఆలీసు. కానీ, ఆమె ఓపిగ్గా వేచి ఉంది.

"ఒకప్పుడు నేను నిజమైన తాబేలునే!" అంటూ నిట్టూరుస్తూ చివరకు మొదలుపెట్టాడు నకిలీ తాబేలు.

ఈ మాటల తరవాత నకిలీ తాబేలు చాలాసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడు.



ఆలీసుకి విసుగొచ్చి 'మంచి కథ చెప్పినందుకు ధన్యవాదాలు!' అని లేచి వెళ్లిపోదాం అనుకుంది. అయినా నకిలీ తాబేలు మంచి కథ చెబుతాడేమోనని ఆశించి కూర్చుంది.

"మా చిన్నతనంలో," అన్నాడు ఆఖరుకి నకిలీ తాబేలు. "మేం బడికి సముద్రంలోకి వెళ్లేవాళ్లం. మాకు ఒక ముసలి మాష్టారు ఉండేవారు. ఆయనను మేమంతా 'తాబేలుగారు' అని పిలిచేవాళ్లం."

"అలా ఎందుకు పిలిచేవారు?" అంది ఆలీసు.

"మాకు గురువుగారు కాబట్టి," అన్నాడు నకిలీ తాబేలు కోపంగా. "అలా ప్రశ్నించినందుకు నువ్వు సిగ్గుపడాలి," ఆలీసుతో అన్నాడు గ్రైఫన్. ఆలీసు చాలా చిన్నబుచ్చుకుంది.

రోజంతా తీసుకోకుండా తొందరగా కథ ముగించమని నకిలీ తాబేలును అడిగాడు గ్రైఫన్.

"అవును. మేం సముద్రంలో బడికి వెళ్లేవాళ్లం. నువ్వు నమ్మవేమో!" అన్నాడు నకిలీ తాబేలు.

"నేను అలా అనలేదే," అంది ఆలీసు.

"నువ్వు అన్నావు," అన్నాడు నకిలీ తాబేలు.

ఆలీసు మళ్లీ ఏం అనకుండానే, "నువ్వు నోరుమూసుకో!" అన్నాడు గ్రైఫన్.

"మాకు మంచి చదువు చెప్పేవారు మా గురువుగారు. మేం రోజూ బడికి వెళ్లేవాళ్లం," కొనసాగించాడు నకిలీ తాబేలు.

"నువ్వు ఒక్కడివే కాదు, నేను కూడా వెళ్లాను బడికి!" అంది ఆలీసు.

"అయితే అదనపు విషయాలు నేర్చుకున్నావా?" అడిగాడు నకిలీ తాబేలు.

"అవును. నేను సంగీతం, ఫ్రెంచి భాష కూడా నేర్చుకున్నాను," అంది ఆలీసు.

"అయితే బట్టలుతకటం కూడా నేర్చుకున్నావా?" అన్నాడు నకిలీ తాబేలు.

"ఛీ!" అంది ఆలీసు.

"అయితే మీ బడి మంచి బడి కాదు. మా బడిలో రశీదు చివరలో ఫ్రెంచి, సంగీతం, బట్టలుతకటం అదనపు విషయాలు అని ఉంటుంది," అన్నాడు తాబేలు.

"సముద్రంలో ఉంటున్న నీకు బట్టలుతకటం నేర్చుకోవడం అనవసరం," అంది ఆలీసు.

"అదనపు విషయాలకు డబ్బు చెల్లించే స్తోమత మాకు లేదు కాబట్టి నేను మామూలు పాఠాలు మాత్రమే నేర్చుకున్నాను," అన్నాడు నకిలీ తాబేలు.

"ఆ మామూలు పాఠాలు ఏమిటో చెప్పగలవా?" అంది ఆలీసు.

"అందరిలాగే చెదరటం, రాలటం* ఉండేవి," నకిలీ తాబేలు బదులిచ్చాడు. "తరవాత లెక్కల్లోని వివిధ అంశాలు ఉండేవి – కూడెయ్యటం, తోసివేతలు, చెత్తచేయటం, భావహరణం*," అన్నాడు.

"చెత్తచేయటమేమిటి? ఇటువంటి వింతైన పాఠాలు నేనెక్కడా వినలేదు," అంది ఆలీసు. "నీకు అలంకరించడమంటే ఏమిటో తెలుసా?" అడిగాడు గ్రైఫన్.

"తెలుసనుకుంటాను," అంది ఆలీసు. "దేనినైనా అందంగా చేయడమే కదా!"

"అందంగా చెయ్యడం తెలుసు కానీ చెత్తగా చెయ్యడమేమిటో తెలియదన్న మాట. అయితే నువ్వు చాలా అమాయకురాలివి," అన్నాడు గ్రైఫన్

దాంతో ఆలీసు ఏమీ అనకుండా తాబేలు వైపు తిరిగి "ఇంకేం నేర్చుకున్నారు?" అని అడిగింది.

---

* ఇంగ్లీషులో reading and writing కి బదులు reeling and writhing అన్న పదాలు ఉపయోగించాడు రచయిత.

* ఇంగ్లీషులో లెక్కలకి సంబంధించి addition, subtraction వంటి వాటికి బదులు ambition, distraction, uglification, derision వంటి పదాలు ఉపయోగించాడు రచయిత.

"విచిత్ర* నేర్చుకున్నాం," చెప్పసాగింది నకిలీ తాబేలు, పంజామీద లెక్కలు వేస్తూ, "పురాతన, ఆధునిక విచిత్ర నేర్చుకున్నాం. సముద్రగోళశాస్త్రం ఉండేది. చిత్రగళం ఉండేది. చిత్రగళ మాస్టారు వారానికి ఒకసారి వచ్చేవారు. ఆయన వీయటం, మెలికలలో హంగులు* వేయటం నేర్పేవారు."

"అది ఎలా ఉండేది?" అంది ఆలీసు.

"నేను బిగదీసుకుని ఉంటాను కాబట్టి అది చూపించలేను," అన్నాడు నకిలీ తాబేలు. "గ్రైఫన్ ఏమో అది నేర్చుకోలేదు."

"నాకు సమయం లేకపోయింది," బదులిచ్చాడు గ్రైఫన్. "కానీ, నేను సంప్రదాయ సంగీతం నేర్చుకున్నాను. ఒక ముసలి పీత దానిని నేర్పేది."

"నేను ఎప్పుడూ పీతగారి దగ్గరకు వెళ్లలేదు. ఆయన నవ్వడం, ఏడవడం నేర్పేవారట," నిట్టూరుస్తూ అన్నాడు నకిలీ తాబేలు.

"అవును, అవును," అన్నాడు గ్రైఫన్. అతడు కూడా తన వంతుగా నిట్టూర్చాడు. ఇద్దరూ వాళ్ల పంజాలతో ముఖాలు కప్పుకున్నారు.

ఆ ప్రస్తావన మార్చాలనే ప్రయత్నంతో "రోజుకు ఎన్ని గంటలు నేర్చుకునేవాళ్లు?" అంది ఆలీసు.

"మొదటి రోజు 10 గంటలు, రెండవరోజు 9 గంటలు, మూడవరోజు 8 గంటలు...." అలా చెబుతూపోయాడు తాబేలు. "ఇదంతా చాలా ఆశ్చర్యంగా ఉందే," అంది ఆలీసు.

"రోజూ సమయం తరుగుతూ ఉండేది కాబట్టి వాటిని తరగతులు* అనేవాళ్లు," చెప్పాడు నకిలీ తాబేలు.

కొద్దిసేపు ఆలోచించిన తరవాత "అలాగయితే 11వ రోజున మీకు సెలవన్న మాట," అంది ఆలీసు.

---

* History కి బదులు Mystery అన్నాడు రచయిత.

* Drawing కి drawling అని, Sketching కి Stretching అని, Painting కి fainting అని ఉపయోగించాడు రచయిత.

* ఇంగ్లీషులో దాదాపు ఒకే ఉచ్చారణ ఉన్న lesson అంటే పాఠం, lessen అంటే తగ్గడం అన్న అర్థాలు ఉన్నాయి.

"అవును," అన్నాడు నకిలీ తాబేలు.

"అయితే మరి 12వ రోజున మీరు ఏం చేసేవారు?" అంది ఎంతో కుతూహలంతో ఆలీసు.

"ఇక్కడికి పాఠాల గురించి చాలు. ఇప్పుడు ఆమెకు ఆటల గురించి చెప్పు," అన్నాడు గ్రిఫన్.

# రొయ్యి నాట్యం

నకిలీ తాబేలు విచారంగా నిట్టూర్చి పంజాలతో కళ్లు తుడుచు కున్నాడు. ఆలీసుని చూసి ఏదో మాట్లాడబోయాడు. కానీ ఏడుపుతో గొంతులో ఏదో అడ్డుపడ్డ వాడిలా మాట్లాడలేకపోయాడు. “అతడి గొంతుకలో ఏ ఎముక ముక్కో అడ్డుపడి ఉంటుంది,” అంటూ గ్రైఫన్ వాడి వీపుమీద నిమురుతూ, గట్టిగా కుదపసాగాడు. దాంతో నకిలీ తాబేలు గొంతు కుదుటపడింది. చెంపలమీదగా కన్నీళ్లు కారుతుండగా చెప్పసాగాడు:

“నువ్వు సముద్రంలో అంతగా నివశించి ఉండవు. (“లేదు,” అంది ఆలీసు.) అసలు రొయ్యని కూడా చూసి ఉండవు,” అన్నాడు. (“నేను రుచి...” అనబోయింది ఆలీసు. కానీ వెంటనే తనలో తాను సర్దుకుని “లేదు,” అంది.) “అయితే నీకు రొయ్య, దాని అందమైన నాట్యం గురించి తెలిసి ఉండదు,” అన్నాడు నకిలీ తాబేలు.

“తెలియదు. ఆ నాట్యం ఎలా ఉంటుంది?” అడిగింది ఆలీసు.

“సముద్రం ఒడ్డున ముందు ఒక వరసలో నిలబడాలి...” అంటూ మొదలుపెట్టాడు గ్రైఫన్.

“కాదు, రెండు వరసలు!” అన్నాడు నకిలీ తాబేలు. “రకరకాల చేపలు, తాబేళ్లు వరసలలో నిలబడతాయి. జెల్లీ చేపలను దారినుంచి తప్పించిన తరవాత...”

“దానికి కొంత సమయం పడుతుంది...” మధ్యలో అడ్డుపడ్డాడు గ్రైఫన్.

“... అప్పుడు రెండడుగులు ముందుకు వేయాలి...”

“ఒక్కొక్క జంతువుకీ జంటగా రొయ్య ఉంటుంది!” అరిచాడు గ్రైఫన్.

“అవును!” అన్నాడు నకిలీ తాబేలు. “తరవాత ఇంకొక రెండు అడుగులు ముందుకు వేస్తారు...”

“...అప్పుడు జంటలు మారుస్తారు. మళ్లీ ఎవరి స్థానాలకు వాళ్లు వెనక్కి వస్తారు,” కొనసాగించాడు గ్రైఫన్.

"అప్పుడు ఏమవుతుందంటే వాళ్లు విసిరి పారేస్తారు..." అన్నాడు నకిలీ తాబేలు.

"ఎవరినో కాదు, రొయ్యలని," అంటూ గాలిలోకి పైకి ఎగిరాడు గ్రైఫన్.

"...ఎంత దూరం సముద్రంలోకి విసరగలిగితే అంత దూరం..."

"వాటి వెనక తక్కినవన్నీ ఈత కొడతాయి," అరిచాడు గ్రైఫన్.

"కొన్ని సముద్రంలో మొగ్గలు వేస్తాయి!" గంతులు వేస్తూ చెప్పాడు నకిలీ తాబేలు.

"మళ్లీ రొయ్యలను మార్చుకోవాలి," కేకపెట్టాడు గ్రైఫన్.

"అప్పుడు భూమి మీదకి తిరిగి వస్తారు. అది మొదటి నాట్యం," అన్నాడు నకిలీ తాబేలు. అప్పటివరకు ఎగురుతూ, గెంతుతూ కేకలు పెడుతూ ఉన్న నకిలీ తాబేలు, గ్రైఫన్ నిశ్శబ్దంగా అయిపోయి విచారంగా ఆలీసు వైపు చూస్తూ కూర్చున్నారు.

"అది చాలా అందమైన నాట్యం అయి ఉంటుంది," అంది ఆలీసు.

"నీకు అది చూడాలని ఉందా?" అన్నాడు నకిలీ తాబేలు.

"తప్పకుండా," అంది ఆలీసు.

"రా! మొదటి నాట్యం ప్రయత్నిద్దాం," గ్రైఫన్‌తో అన్నాడు నకిలీ తాబేలు. "మనం రొయ్యలు లేకుండా కూడా నాట్యం చెయ్యవచ్చు, తెలుసా! మరి పాట ఎవరు పాడతారు?" అన్నాడు.

"నువ్వు పాడు! నేను పదాలు మరచిపోయాను," అన్నాడు గ్రైఫన్.

ఆలీసు చుట్టూ వాళ్లు నాట్యం చెయ్యడం మొదలుపెట్టారు. నకిలీ తాబేలు పాడడం మొదలుపెట్టాడు. మధ్య మధ్యలో బాగా దగ్గరికి వచ్చినప్పుడు పాపం ఆలీసు కాళ్లను తొక్కేశారు కూడా.

నకిలీ తాబేలు పాట ఇలా కొనసాగింది:

*"కొంచెం తొందరగా నడుస్తావా?" అంది నత్తగుల్ల.*
*"మన వెనకే ఉంది పీత, కాళ్లు తొక్కుతుంది మళ్ల,*



*రొయ్యలు, తాబేళ్లు ఉత్సాహంతో ఉన్నాయి*
*గట్టుమీద వేచి ఉన్నాయి, నువ్వు కూడా వస్తావటోయి?*
*నాట్యం చేస్తావా, చెయ్యవా, చేస్తావా, చెయ్యవా,*
*నాట్యం చేస్తావటోయి?*
*నాట్యం చేస్తావా, చెయ్యవా, చేస్తావా, చెయ్యవా,*
*నాట్యం చెయ్యవటోయి?*

*"నువ్వు ఊహించలేవు, ఎంత బాగుంటుందో అదంతా*
*రొయ్యలతో కలిపి మనల్ని సముద్రంలోకి విసురుతారంట!"*
*"చాలా దూరం విసురుతారు బాబోయ్!" నత్తగుల్ల అంది,*
*మీ నాట్యానికి, మీకు దండం తను మాత్రం రానంది.*

*నాట్యం చెయ్యలేను, చెయ్యను, చెయ్యలేను, చెయ్యను,*
*నాట్యం నేను చేయలేనోయి!*
*నాట్యం చెయ్యలేను, చెయ్యను, చెయ్యలేను, చెయ్యను*
*నాట్యం నేను చెయ్యనోయి!*

*"ఎంద దూరమైతేనేం," పొలుసుల మిత్రుడు అంది.*
*"ఆవలివైపున మరో తీరం తప్పక ఉంటుంది.*
*ఇంగ్లాండుకి దూరమైతే ఫ్రాన్స్‌కి దగ్గరవుతాం*
*భయపడకు మిత్రమా, రా నాట్యం చేద్దాం*
*నాట్యం చేస్తావా, చెయ్యవా, చేస్తావా, చెయ్యవా,*
*నాట్యం చేస్తావటోయి?*
*నాట్యం చేస్తావా, చెయ్యవా, చేస్తావా, చెయ్యవా,*
*నాట్యం చెయ్యవటోయి?"*

"చాలా బాగుంది నాట్యం!" అది చివరికి అయిపోయిందని ఊరట పొందుతూ అంది ఆలీసు. "ఆ తెల్ల చేప పాట కూడా బాగుంది."

"అయితే నువ్వు ఆ చేపని చూశావా?" అన్నాడు నకిలీ తాబేలు.

"అవును, నేను చూశాను; వాటిని భోజ..." అని ఆగిపోయింది ఆలీసు.

"నాకు 'భోజ' ఎక్కడ ఉంటుందో తెలియదు. వాటిని చాలాసార్లు చూసి ఉంటే అవి ఎలా ఉంటాయో నీకు బాగా తెలిసి ఉండాలి," అన్నాడు నకిలీ తాబేలు.

"అవును, నాకు తెలుసు. వాటి తోక నోట్లో ఉంటుంది. వాటి శరీరం అంతా బురదగా ఉంటుంది," అంది ఆలీసు.

"బురద విషయంలో నువ్వు తప్పు. అవి సముద్రంలో ఉంటే, బురద అంతా కడుక్కుపోతుంది. వాటి తోక నోట్లో ఉండడం నిజం. దానికి కారణం ..." అంటూ ఆవులించి కళ్లు మూసుకున్నాడు నకిలీ తాబేలు. "ఆ కారణం ఏమిటో నువ్వు చెప్పు," గ్రైఫన్‌తో అన్నాడు నకిలీ తాబేలు.

"కారణం ఏమిటంటే, అవి రొయ్యలతో నాట్యానికి వెళతాయి. అప్పుడు వాటిని సముద్రంలోకి విసిరేస్తారు. సముద్రంలో చాలా దూరంలో పడాలంటే వాటి తోకలు నోట్లో ఉండాలి. అంతే!" అన్నాడు గ్రైఫన్.

"తెల్ల చేప సంగతి నాకు ఇప్పటివరకు తెలియదు. తెలియజేసినందుకు కృతజ్ఞతలు," అంది ఆలీసు.

"నీకు తెలుసుకోవాలంటే ఇంకా చాలా సంగతులు చెప్పగలను," అన్నాడు గ్రైఫన్. "వాటిని తెల్లచేపలని ఎందుకు అంటారో నీకు తెలుసా?"

"ఎందుకు? నేనెప్పుడూ ఆ విషయం ఆలోచించలేదు," అంది ఆలీసు.

"అది చెప్పులు, బూట్లను మెరిపిస్తుంది," అన్నాడు గ్రైఫన్.

"చెప్పులు, బూట్లను మెరిపిస్తుందా?" ఆశ్చర్యంగా అంది ఆలీసు.

"ఎందుకు అంత ఆశ్చర్యం. నీ జోళ్లను నల్లగా నిగనిగలాడేట్లు దేనితో చేశారు?" అన్నాడు గ్రైఫన్.

కొంతసేపు ఆలోచించి, అవి నల్ల రంగుతో నిగనిగలాడుతున్నాయని చెప్పింది ఆలీసు.

"సముద్రంలో జోళ్లు తెల్ల రంగుతో మెరిపిస్తారు. తెలిసిందా ఇప్పుడు?" అన్నాడు గ్రైఫన్.

"ఎలా మెరిపిస్తారు?" అంది ఆలీసు మరింత ఆశ్చర్యంతో.

"పాములు, చేపలతో చేస్తారు. ఈ విషయం ఎంత తెలివితక్కువ వాళ్లకయినా తెలుస్తుంది," అన్నాడు గ్రైఫన్ కోపంగా.

"నేనుగాని తెల్ల చేపనైతే," అంది ఆలీసు పాట గురించి ఆలోచిస్తూ. "నకిలీ తాబేలుతో చెబుతాను, మాతోటి రావద్దు, నువ్వు మాకు వద్దు."

"తాబేలును తప్పక తీసుకుని వెళ్లాలి," అన్నాడు నకిలీ తాబేలు. "అసలు తెలివైన చేపలు ఏవీ తాబేలు లేకుండా వెళ్లవు," అని నొక్కి చెప్పాడు.

"నిజంగానా!" ఆశ్చర్యం వ్యక్తపరుస్తూ అంది ఆలీసు.

"అవును," అన్నాడు నకిలీ తాబేలు. "చేప వచ్చి నేను యాత్రకి వెళుతున్నాను అంటే, ఏ తాబేలుతో వెళుతున్నావని తప్పక అడుగుతాను."

“ఏ పనిమీద వెళుతున్నావని అడుగుతున్నావా లేక ఏ తాబేలుతో వెళుతున్నావని అడుగుతున్నావా?”* అంది ఆలీసు.

“నేనేదంటే అది అడుగుతాను,” అన్నాడు కోపంగా నకిలీ తాబేలు. “నువ్వు చూసిన, చేసిన అద్భుతాలన్నీ చెప్పు,” అన్నాడు గ్రిఫన్ ఆలీసుతో.

“ఈ రోజు జరిగిన వింతలన్నీ చెబుతాను,” సందేహంగా అంది ఆలీసు. “నిన్నటి గురించి ఆలోచించటంలో అర్థం లేదు. ఎందుకంటే నిన్నటి రోజు నేను పూర్తిగా వేరే మనిషిని.”

“అయితే ఆ సంగతంతా వివరంగా చెప్పు,” అన్నాడు నకిలీ తాబేలు.

“వద్దు! వద్దు! ఒక్క అద్భుతాల గురించే చెప్పు. అన్నీ వివరంగా చెపితే చాలా కాలం వృథా అయిపోతుంది,” అన్నాడు గ్రిఫన్.

తెల్ల కుందేలును కలిసినప్పటి నుండి జరిగిన విశేషాలు, అనుభవాలు చెప్పసాగింది ఆలీసు. నకిలీ తాబేలు, గ్రిఫన్ చెరొక పక్కా బాగా దగ్గరికి చేరి కళ్లు పెద్దవి చేసుకొని, నోరు తెరిచి కూర్చోవడం వల్ల ఆలీసు మొదట్లో కొంచెం తడబడింది. కాని మెల్లగా ఆత్మవిశ్వాసం పుంజుకుని ధైర్యంగా చెప్పసాగింది. ‘నువ్వు ముసలివాడివి, విలియం,’ దగ్గరకు వచ్చేవరకు శ్రోతలు మాట్లాడకుండా విన్నారు. కాని గొంగళిపురుగుకి చెప్పిన పద్యం అంతా తారుమారు కావటంతో “ఇదంతా వింతగా ఉందే,” అన్నాడు పెద్దగా ఊపిరి తీస్తూ నకిలీ తాబేలు.

“ఉండవలసినంత వింతగా ఉంది,” అన్నాడు గ్రిఫన్.

“అదంతా తప్పు చెప్పింది. ఆలీసు వేరేదైనా చెపితే వింటాను. ఆమెను మొదలుపెట్టమని చెప్పు,” అంటూ గ్రిఫన్‌వైపు చూశాడు నకిలీ తాబేలు. గ్రిఫన్‌కి ఆలీసు మీద ఏదో అధికారం ఉండి ఉంటుంది అనుకున్నాడు నకిలీ తాబేలు.

---

* తాబేలుని ఇంగ్లీషులో Turtle అనీ, Tortoise అనీ అంటారు. Purpose అంటే ఉద్దేశమని అర్థం. 'With what porpoise?' అని అడుగుతాడు నకిలీ తాబేలు. Tortoise నీ, Purpose నీ కలగలిపి చేసిన పదం అది.

“ ‘అది రొయ్యా గొంతుక...’ అన్న పద్యం నిలబడి మళ్లీ చెప్పు,” అన్నాడు గ్రైఫన్ ఆలీసుతో.

‘ఏమిటి వీళ్లు ఇంత అధికారం చూపెడుతున్నారు,’ అని తనలో తాను అనుకుంది ఆలీసు, ‘నేను బడిలో ఉన్నట్టు ఉంది.’ అయినా ఆలీసు నిలబడి వల్లించడం మొదలుపెట్టింది. కానీ ఆమె ఆలోచనలన్నీ రొయ్య నాట్యంమీదే ఉన్నాయి.

*“అది రొయ్య గొంతుక, దాని మాటలు:*
*‘మరీ ఎర్రగా వేయించావు, నాకు కావాలి పంచదార....*
*బాతుగారి కనురెప్పలు, దాని పొడవాటి ముక్కు*
*గుండీలు సరిచేసుకుని, లాగుతుంది కాళ్లను వెనక్కు.*
*ఇసక పొడిగా ఉంటే, కొంగలాగా ఆడుతుంది*
*తిమింగలమంటే లెక్కలేనట్లు మాట్లాడుతుంది;*
*సముద్రం పోటెత్తి తిమింగలాలు తిరుగుతుంటే,*
*భయం భయంగా తిరుగుతుంది, గొంతు వణుకుతుంది.’ ”*



“ఇది నేను చిన్నప్పుడు నేర్చుకున్న దానికంటే వేరుగా ఉంది,” అన్నాడు గ్రైఫన్.

“నేను ఇది ఎప్పుడూ వినలేదు. కానీ అర్థంలేని ప్రాసలాగా ఉంది,” అన్నాడు నకిలీ తాబేలు.

మరేమీ అనకుండా తన ముఖాన్ని చేతుల్లో దాచుకొని, ఈ రోజు ఏదైనా మామూలుగా జరుగుతుందా అని ఆందోళన పడసాగింది ఆలీసు.

“అది ఏమిటో నాకు వివరించు,” అన్నాడు నకిలీ తాబేలు.

“ఆమె వివరించగలదు. ఇందాకటి నీ పాటను పూర్తిచెయ్యి,” కంగారుగా అన్నాడు గ్రైఫన్.

“కాళ్లను బాతు వెనక్కి ఎలా లాక్కుందో చెప్పు,” అన్నాడు నకిలీ తాబేలు.

“అది నాట్యంలో మొదటిది,” అంది ఆలీసు. కానీ ఇంకేం చెప్పాలో తోచక ఆ ప్రస్తావన మార్చాలనుకుంది.

అసహనంగా “ఇంకొక చరణం పాడు,” అన్నాడు గ్రైఫన్. “ ‘నేను వాళ్ల తోట ముందు నుంచి వెళ్లాను,’ అంటూ మొదలవుతుంది,” అని గుర్తు చేశాడు.

ఆలీసుకి ఏం చెప్పడానికీ ధైర్యం చాలక, తప్పు వస్తుందన్న భయంతో వణుకుతున్న కంఠంతో చెప్పసాగింది:

*“నేను వాళ్ల తోట ముందునుంచి వెళ్లాను, అటు ఒక్క కన్నువేశా,*
*చిరుత, గుడ్లగూబ పూరీ పంచుకున్న తీరు చూశా: పూరీ, కూరా*
*మొత్తంగా చిరుత గుటుక్కుమని మింగింది,*
*గుడ్లగూబకు తన వంతుగా పళ్లెం మాత్రం మిగిలింది.*
*ఆమాత్రం దొరకటం గుడ్లగూబకు వరమంది*
*పొట్టనిండా మెక్కిన చిరుత పెద్దగా...”*

“అదంతా ఊరికే వల్లెవేయడం వల్ల లాభం ఏమిటి?” మధ్యలో

అందుకున్నాడు నకిలీ తాబేలు. “మధ్య మధ్యలో ఆపుతూ, నువ్వు చెబుతున్న దానికి అర్థం కూడా తెలియబరచాలి. లేకపోతే వినేవాళ్లకి ఇదంతా అయోమయంగా ఉంటుంది,” అన్నాడు.

“అవును ఇంక ఇక్కడితో ఆపేయవచ్చు,” అన్నాడు గ్రైఫన్. ఆలీసు అందుకు సంతోషించింది.

“మనం రొయ్య నాట్యంలో ఇంకొక నాట్యం చేద్దామా లేకపోతే నకిలీ తాబేలును పాడమందామా?” అన్నాడు గ్రైఫన్.

“పాట! తప్పకుండా! నకిలీ తాబేలు పాడ్డానికి ఇష్టపడితే,” అంది ఆలీసు.

“ ‘తాబేలు పులుసు’ పాట పాడి ఆమెకు వినిపించు,” అన్నాడు గ్రైఫన్ నకిలీ తాబేలుతో.

*“రుచికరమైన చారు, ఎంతో పోషకవంతమైన చారు,*
*వేడిగిన్నెలో దానిని చూస్తే ఎవరికైనా నోరు ఊరు!*
*ఇటువంటి చారుతో జన్మతరించి తీరు!*
*ఒకసారి తాగితే మళ్లీ మళ్లీ కోరతారు!*
*రుచికరమైన చారు, రాత్రి అన్నంలోకి చారు!*
*ఒకసారి తాగితే మళ్లీ మళ్లీ కోరతారు!*
*పో...షకవంతమైన చా...రు!*
*ఒకసారి తాగితే మళ్లీ మళ్లీ కోరతారు!*
*రా...త్రి అన్నంలోకి చా...రు,*
*రుచి, రుచికరమైన చారు!*

*చారు ఉంటే చాలు ఎందుకులే కోడి*
*వద్దు చేప, వద్దు వేట, వద్దు రొయ్య పకోడి.*
*రెండు చుక్కల చారు కోసం,*
*ఎవరైనా చేస్తారు అంతా త్యాగం.*

*పో...షకవంతమైన చా...రు!*
*ఒకసారి తాగితే మళ్లీ మళ్లీ కోరతారు!*
*రా...త్రి అన్నంలోకి చా...రు,*
*రుచి, రుచికరమైన చారు!"*

"అందరూ కలిసి చరణం పాడండి," అని అరిచాడు గ్రైఫన్. నకిలీ తాబేలు మళ్లీ పాటను ప్రారంభించేలోగా దూరంగా ఎవరో "విచారణ ప్రారంభం!" అని అరవడం వినిపించింది.

"పదండి! పదండి!" అంటూ అరుస్తూ గ్రైఫన్ పాట అయిపోయేవరకు ఆగకుండా, ఆలీసు చేయి పట్టుకుని పరిగెత్తసాగాడు.

"ఎవరిని విచారిస్తున్నారు?" అని అడిగింది ఆలీసు. దానికి జవాబు చెప్పకుండా "పద! పద!" అన్నాడు గ్రైఫన్ వేగంగా పరిగెడుతూ. గాలిలో తేలియాడుతూ వచ్చే విచార స్వర చరణాలు మెల్లగా దూరం కాసాగాయి...

*"రా...త్రి అన్నంలోకి పో...షకవంతమైన*
*రుచి, రుచికరమైన చారు!"*

# ఎవరు దొంగ

రాజుగారు, రాణీగారు సింహాసనం మీద కూర్చుని ఉన్నారు. రకరకాల జంతువులు, పక్షులు, భటులతో సభ కోలాహలంగా ఉంది. వాళ్లముందు గొలుసులతో కట్టివేయబడి జాకీ ఉన్నాడు. అతడికి కాపలాగా ఇరువైపులా సైనికులు ఉన్నారు. తెల్ల కుందేలు ఒక చేతిలో బూర, రెండవ చేతిలో ఒక పత్రం పట్టుకొని రాజుగారి దగ్గరలో ఉంది. సభ మధ్యలో బల్లమీద పెద్ద పళ్లెంలో కజ్జికాయలు ఉన్నాయి. కజ్జికాయల పళ్లెం చూడ్డంతో ఆలీసుకి ఆకలి వేసింది. 'విచారణ తొందరగా ముగించి కజ్జికాయలు పంచితే బాగుండును!' అనుకుంది ఆలీసు. అక్కడి పరిస్థితి చూస్తే విచారణ త్వరగా



పూర్తయ్యేటట్లు లేదు. దాంతో ఆలీసు అక్కడ ఉన్న వారినందరినీ చూడడం మొదలుపెట్టింది.

ఆలీసు అంతకు ముందు పుస్తకాలలో చదవడమే కాని ఎప్పుడూ నిజమైన న్యాయస్థానాలని చూడలేదు. తను చదివిన దానివల్ల అక్కడ అన్ని పేర్లు తెలిసి ఉండడం ఆలీసుకి సంతోషాన్నిచ్చింది. 'అతడు న్యాయమూర్తి,' అనుకుంది ఆలీసు, 'అతడు పెట్టుకున్న పెద్ద విగ్గు వల్ల తేలికగా తెలుస్తోంది.'

చూడగా అక్కడ న్యాయాధిపతి రాజుగారే. న్యాయాధిపతి విగ్గుపైన కిరీటాన్ని పెట్టుకొని ఆయన నానా అవస్థ పడుతున్నారు. అది అతడికి ఏమంత నప్పలేదు.

'అది న్యాయవాదుల స్థానం,' అనుకుంది ఆలీసు, 'ఆ పన్నెండు జీవులు (వాళ్లల్లో కొన్ని జంతువులు, కొన్ని పక్షులు ఉండటం వల్ల 'జీవులు' అనక తప్పలేదు), 'న్యాయవాదులై ఉంటారు.' తన ఈడు పిల్లల్లో చాలా కొద్ది మందికి మాత్రమే ఇవన్నీ తెలిసి ఉండటంవల్ల ఆమె గర్వపడుతూ చివరి మాటలు పదేపదే వల్లెవేయసాగింది.

ఆ పన్నెండుమంది న్యాయవాదులు తమ పలకలపై ఏదో రాసేస్తున్నారు. "వాళ్లంతా ఏం చేస్తున్నారు?" గ్రైఫన్‌తో గుసగుసగా అంది ఆలీసు, "విచారణ మొదలయ్యేదాకా రాయడానికి ఏముంది?" అని అడిగింది.

జవాబుగా "ఏమీ లేదు. మరచి పోకుండా ఉండాలని వాళ్ల పేర్లు రాసుకుంటున్నారు," అన్నాడు గ్రైఫన్ గుసగుసగా.

"అయ్యో! ఎంత తెలివితక్కువ వాళ్లు," గట్టిగా అరవబోయింది ఆలీసు. తెల్ల కుందేలు "నిశ్శబ్దం, నిశ్శబ్దం!" అని అరవడంతో ఆలీసు ఆగిపోయింది. ఎవరెవరు మాట్లాడుతున్నారో తెలుసుకోడానికి, రాజుగారు కళ్లజోడును సవరించుకొని చుట్టుపక్కల చూడసాగారు.

న్యాయవాదుల భుజాల మీదనుంచి చూస్తున్న ఆలీసుకి స్పష్టంగా వాళ్లు పలక మీద 'పిచ్చి విషయాలు' రాయటం కనపడుతోంది. వాళ్లలో ఒకరికి 'పిచ్చి' ఎలా రాయాలో తెలియక పక్క న్యాయవాదిని అడగటం

కూడా ఆమె చూసింది. 'విచారణ పూర్తి అయ్యేసరికి వాళ్ల పలకలు గందరగోళంగా తయారవుతాయి!' అనుకుంది ఆలీసు.

ఒక న్యాయవాది రాస్తున్నంతసేపు అతడి బలపం కీచుకీచుమని శబ్దం చేస్తోంది. ఈ శబ్దాన్ని ఏమాత్రం భరించలేకపోయింది ఆలీసు. ఆమె సభ చుట్టూ తిరిగి ఆ న్యాయవాది వెనక్కి వెళ్లి అవకాశం దొరకగానే లటుక్కున బలపం లాగేసుకుంది. అది ఎంత చిటికెలో చేసిందంటే న్యాయవాదికి (ఆ న్యాయవాది ఎవరో కాదు మిస్టర్ బల్లి) బలపం ఏమయ్యిందో తెలియలేదు. అటు ఇటు వెతికినా బలపం కనపడక పోవడంతో ఇక ఆ రోజంతా అతడు వేలితోనే పలకమీద రాయవలసి వచ్చింది. అయితే వేలితో పలకమీద ఏమీ పడదు కాబట్టి దాని వల్ల ప్రయోజనమేమీ లేదు.

రాజుగారు "తెల్ల కుందేలు! జాకీపై ఆరోపణలేమిటో చదువు," అని ఆజ్ఞాపించారు.

దాంతో తెల్ల కుందేలు తన బూరను మూడుసార్లు ఊది పత్రం విప్పి ఇలా చదవడం మొదలుపెట్టింది...

***"ఆటీను రాణీ చేశారు కాజాలు***
***వేసవి రోజున శ్రమపడి:***
***ఆటీను జాకీ చూశాడు ఆ కాజాలు***
***దొంగిలించాడు వాటిపై మనసుపడి!"***

"అయితే ఏ శిక్ష విధిస్తారు?" అని న్యాయవాదులను అడిగారు రాజుగారు.

"అప్పుడే కాదు. దానికంటే ముందు చాలా తతంగం ఉంది," అంటూ మధ్యలో అడ్డుపడింది తెల్ల కుందేలు.

"అయితే మొదటి సాక్షిని పిలవండి," అన్నారు రాజుగారు. తెల్ల కుందేలు మూడుసార్లు బూర ఊది, "మొదటి సాక్షిని ప్రవేశపెట్టండి," అంది.

చూడగా మొదటి సాక్షి టోపీలవాడు. అతడు ఒక చేతిలో గ్లాసు, రెండవ చేతిలో రొట్టెముక్కను పట్టుకుని వచ్చాడు. "అయ్యా! నన్ను క్షమించాలి.

నేను టీ తాగుతుండగా నన్ను పిలిచారు. అందుకని ఇలా రావాల్సి వచ్చింది," అన్నాడు.

"పూర్తి చేసిన తరవాత వచ్చి ఉండాల్సింది," అన్నారు రాజుగారు. "టీ తాగటం ఎప్పుడు మొదలుపెట్టావు?"

అతడి వెనకాలే న్యాయస్థానంలోకి చేతిలో చేయివేసుకుని వచ్చిన మార్చి కుందేలు, చుంచెలుకను టోపీలవాడు చూశాడు. "మార్చి నెల 14వ తారీకు అనుకుంటాను," అన్నాడు టోపీలవాడు.




"కాదు పదిహేను," అన్నాడు మార్చి కుందేలు.

"కాదు, కాదు. పదహారు," అన్నాడు చుంచెలుక.

"ఇదంతా రాసుకోండి," న్యాయవాదులతో అన్నారు రాజుగారు. వాళ్లు అది గబగబ రాసుకుని కూడిక చేసి రూపాయలలోకి మార్చారు.

"నీ టోపీని తీసేయి," అని టోపీలవాడిని ఆజ్ఞాపించారు రాజుగారు.

“అది నాది కాదు ప్రభూ,” అన్నాడు టోపీలవాడు.

“అయితే దొంగిలించింది అయి ఉంటుంది,” అన్నారు రాజుగారు న్యాయవాదులవైపు చూస్తూ. వాళ్లు గబగబా ఆ వాస్తవాన్ని రాయడం మొదలుపెట్టారు.

“అయ్యా! నేను టోపీలు అమ్ముతాను. నాకు సొంతంగా ఏవీ ఉంచుకోను. నేను కేవలం టోపీలను అమ్ముకునేవాడిని,” వివరణ ఇస్తూ అన్నాడు టోపీలవాడు.

ఆ సమయంలో రాణీగారు కళ్లజోడు పెట్టుకుని, టోపీలవాడివైపు సూటిగా చూడసాగారు. పాపం! టోపీలవాడు భయంతో పాలిపోయి వణకడం మొదలుపెట్టాడు.

“వణకడం మానేసి నీ సాక్ష్యం చెప్పు. లేకపోతే వెంటనే నీ తల తీయించేస్తా,” అన్నారు రాజుగారు.

రాజుగారలా అనడంతో టోపీలవాడు మరింత భయపడ్డాడు. వాడికి కంగారెక్కువై కాసేపు ఒక కాలు మీదకి, కాసేపు రెండో కాలు మీదకి మారుతూ రాణీగారి వైపు భయం భయంగా చూడసాగాడు. ఆ కంగారులో రొట్టె కొరకడానికి బదులు టీ కప్పుని కొరికాడు.

ఆ సమయంలో ఆలీసుకి ఏదో వింతగా అనిపించసాగింది. తీరా చూస్తే తను మళ్లీ పెరగడం మొదలుపెట్టినట్లు గ్రహించింది. ముందు న్యాయస్థానంలోంచి వెళ్లిపోవాలనుకుంది. కానీ జాగా సరిపోయేవరకు అక్కడే ఉండి జాగా సరిపోనప్పుడే బయటకి వెళ్లాలని నిర్ణయించుకుంది.

“నన్ను మరీ అంతగా నొక్కెయ్యకు, నాకు ఊపిరి ఆడ్డం లేదు,” అన్నాడు పక్కనున్న చుంచెలుక.

“నేనేమీ చేయలేను, నేను పెరిగి పోతున్నాను,” మెల్లగా అంది ఆలీసు.

“ఇక్కడ పెరగడానికి వీల్లేదు,” అన్నాడు చుంచెలుక.

“పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. నువ్వు కూడా పెరుగుతున్నావు తెలుసా?” అంది ఆలీసు.

"తెలుసు, కానీ నేను నీ అంత తొందరగా పెరగడం లేదు," అంటూ చుంచెలుక లేచి వెళ్లిపోయాడు. బుంగమూతి పెట్టి న్యాయస్థానంలో రెండవ వైపుకి వెళ్లి కూర్చున్నాడు.

ఇది ఇలా జరుగుతూ ఉండగా టోపీలవాడి వైపు దృష్టి మరల్చకుండా తీక్షణంగా చూస్తూ రాణీగారు కూర్చున్నారు. చుంచెలుక న్యాయస్థానంలో రెండవ వైపుకి వెళుతున్నప్పుడు రాణీగారు "కిందటిసారి న్యాయస్థానంలో పాటపాడిన వారి పేర్లను రాసి తీసుకుని రండి!" అని న్యాయస్థానంలో అధికారి ఒకరిని ఆదేశించారు. అది విని టోపీలవాడు వణకడంతో అతడి రెండు జోళ్లూ ఊడిపోయాయి.

"నీ సాక్ష్యం చెప్పు. లేకపోతే నీ తల నరికించేస్తాను," అని కోపంగా అన్నారు రాజుగారు.

టోపీలవాడు "అయ్యా నేను చాలా పేదవాడిని," అంటూ వణుకుతూ మొదలుపెట్టాడు టోపీలవాడు. "నేను తేనీరు తాగడం మొదలుపెట్టి వారం అయి ఉంటుంది ప్రభూ! ఇంతలో నా రొట్టెముక్క మరీ చిన్నదై పోయింది. నా తేనీరు తెల్లగా మారింది..."

"తెల్లగా మారడమేమిటి," అన్నారు రాజుగారు.

"అదే! తేనీటితో మొదలైంది."

"తేనీరు, తెలుపు రెండూ 'తె'తోనే మొదలవుతాయి. నేను తెలివితక్కువ వాడిని అనుకున్నావా? సాక్ష్యం చెప్పు!" అన్నారు రాజుగారు కోపంగా.

"అయ్యా నేను పేదవాడిని," అంటూ మళ్లీ మొదలుపెట్టాడు టోపీలవాడు. "చాలా వస్తువులు తెల్లగా అవడం మొదలుపెట్టాయి... మార్చి కుందేలు ఏమన్నాడంటే..."

"నేను అనలేదు!" అన్నాడు మార్చి కుందేలు.

"అతడు అనలేదంటున్నాడు కాబట్టి అది వదిలేసి చెప్పు," అన్నారు రాజుగారు.

"సరే, చుంచెలుక ఏమన్నాడంటే..." చుంచెలుక కూడా తాను అనలేదంటాడేమో అన్న ఆందోళనతో దానివైపు చూశాడు టోపీలవాడు.

కాని చుంచెలుక గాఢనిద్రలో ఉండటం వల్ల దేనినీ తిరస్కరించే స్థితిలో లేదు.

"అయ్యా! ఆ తరవాత నేను ఇంకొక రొట్టెముక్కను తుంచాను..." అన్నాడు టోపీలవాడు.

"చుంచెలుక ఏమన్నాడు?" అని న్యాయవాదులలో ఒకరు ప్రశ్నించారు.

"అది నాకు గుర్తులేదు," అన్నాడు టోపీలవాడు.

"నువ్వు గుర్తు తెచ్చుకోవాలి. లేకపోతే నీ తల తీయించేస్తా," అన్నారు రాజుగారు.

టోపీలవాడు రొట్టెముక్క, గ్లాసు కిందపడేసి మోకాళ్లమీద నిలబడి "నేను చాలా పేదవాడిని," అంటూ ప్రాధేయపడడం మొదలుపెట్టాడు.

"నువ్వు మాటలలో పేదవాడివి," అన్నారు రాజుగారు.

ఇది విని ఒక గినీ పంది ఒకటి తన హర్షం ప్రకటించింది. వెంటనే న్యాయస్థాన అధికారి ఒకరు దానిని అణిచివేశారు. (ఇది అర్థం చేసుకోవటం కష్టం కాబట్టి అదెలా చేస్తారో వివరిస్తాను. వాళ్ల దగ్గర ఒక పెద్ద గోనెసంచి ఉంది. దాని మూతి తాడుతో కట్టేసి ఉంది. ఈ గోనెసంచిలోకి గినీపందిని తలకిందులుగా తోసేసి, దానిమీద కూర్చున్నారు.)

'విచారణ పూర్తి అయిన తరవాత దిన పత్రికలలో 'హర్షం ప్రకటించటానికి జరిగిన ప్రయత్నాన్ని న్యాయస్థాన అధికారులు అణిచివేశారు,' అని చదివేదాన్ని. అయితే అదేమిటో నాకు ఎప్పుడూ బోధపడలేదు. ఇప్పుడు ఇది చూడగలిగినందుకు సంతోషంగా ఉంది. అదేమిటో కూడా అర్థమయ్యింది,' అనుకుంది ఆలీసు.

"ఇంతకంటే నీకేమీ తెలియకపోతే ఆ బోనునుంచి దిగవచ్చు," అన్నారు రాజుగారు టోపీలవాడితో.

"ప్రభూ! నేను ఇంక దిగలేను. ఎందుకంటే నేను నేలపై మోకాళ్లమీద ఉన్నాను," అన్నాడు టోపీలవాడు.

"అయితే కూర్చో," అన్నారు రాజుగారు.

టోపీలవాడి మాటకు ఇంకొక గినీ పంది నవ్వింది. దాన్ని కూడా

అణిచివేశారు.

'దీంతో గినీ పందుల పని అయిపోయింది. ఇక విచారణ వేగంగా సాగుతుంది,' అనుకుంది ఆలీసు. రాణీగారు పాటపాడిన వాళ్లపేర్లు చూస్తూ ఉండగా, టోపీలవాడు "నేను తేనీరు తాగటం పూర్తి చేస్తాను," అంటూ రాణీగారి వైపు చూడసాగాడు.

"ఇక నువ్వు వెళ్లవచ్చు," అని రాజుగారు అనడంతో టోపీలవాడు జోళ్లు కూడా వేసుకోకుండా వెంటనే పరుగు పుచ్చుకున్నాడు.

పరుగు పెడుతున్న టోపీలవాడిని ఉద్దేశించి "వాడి తల తీసేయండి," అని రాణీగారు ఆజ్ఞాపించారు. భటుడు బయటకి వెళ్లి పట్టుకునే లోపలే టోపీలవాడు పారిపోయాడు.

"రెండవ సాక్షిని పిలవండి," అన్నారు రాజుగారు.

రెండవ సాక్షి యువరాణి దగ్గర పనిచేసే వంటమనిషి. ఆమె చేతుల్లో ఇంకా మిరియాల డబ్బా ఉంది. ఆలీసు చుట్టుపక్కలున్న అందరూ ఒక్కసారిగా తుమ్మడం మొదలుపెట్టటంతో ఆ రాబోతున్నది ఎవరో ఆమెకి ముందుగానే అర్థమయ్యింది.

"నీ సాక్ష్యం చెప్పు," అన్నారు రాజుగారు.



"నేను చెప్పను," అంది వంటామె.

రాజుగారు తెల్ల కుందేలు వైపు ఆందోళనగా చూడడంతో, రహస్యంగా కుందేలు రాజుగారితో లోగొంతుకలో "మీరు ఆమెని ప్రశ్నలు వేసి పరీక్షించాలి," అంది.

"ప్రశ్నించాల్సి ఉంటే ప్రశ్నిస్తాను," నిర్వేదంగా అన్నారు రాజుగారు. అతడు చేతులు మడిచి, వంటామె వైపు కళ్లు పొడుచుకు వచ్చేదాకా తీక్షణంగా చూశాడు. ఆ తరవాత గంభీరమైన గొంతుతో "కాజాలు ఎలా చేస్తారు?" అని అడిగాడు.

"మిరియాలపొడి ముఖ్యం," అంది వంటామె.

"బెల్లం నీళ్లతో," ఆమె వెనకనుంచి నిద్రలోంచి మాట్లాడిన మాటలు వినపడ్డాయి.

"వాడికి మరణశిక్ష వేయండి," అన్నారు రాణీగారు. "న్యాయస్థానంలో నుంచి బయటకు తరిమేయండి! తల నరకండి! గిల్లండి! వాడి మీసాలు తీయించేయండి!" అంటూ అరిచారు.

చుంచెలుకను బయటకు తరమటంలో కొంతసేపు న్యాయస్థానం అంతా గందరగోళంగా మారింది. అందరూ తిరిగి తమతమ స్థానాలలో కూర్చునేసరికి వంటామె మాయమైపోయింది.

"పరవాలేదు," అన్నారు రాజుగారు నిట్టూర్పు విడుస్తూ. "తరవాత సాక్షిని ప్రవేశపెట్టండి," అంటూ రాణీగారివైపు తిరిగి లోగొంతుకలో, "నాకు తలనొప్పిగా ఉంది. తరవాత సాక్షిని మీరు విచారించాలి," అంటూ రాణీగారిని కోరారు.

సాక్షుల జాబితాను పరీక్షిస్తూ ఉన్న తెల్ల కుందేలు వైపు చూపు మార్చింది ఆలీసు. 'ఇప్పటివరకూ ఎటువంటి సాక్ష్యమూ దొరకలేదు... తరవాత సాక్షి ఎవరై ఉంటారా' అన్న కుతూహలంతో ఉంది ఆలీసు. తెల్ల కుందేలు పెద్దగా "ఆలీసు!" అని చదవటంతో ఆమె ఎంతటి ఆశ్చర్యానికి గురై ఉంటుందో ఊహించుకోండి.

# ఆలీసు సాక్ష్యం

తను ఎంత పెరిగిపోయిందో తెలియని ఆలీసు "ఇక్కడ," అంటూ గభాలున లేచింది. ఆ కంగారులో ఆమె న్యాయవాదులు కూర్చున్న చోటు మీదనుంచి కాలు వేసింది. ఆమె గౌను అంచు తగిలి న్యాయవాదులందరూ తల్లకిందులుగా కిందనున్న సభికుల మధ్య చెల్లాచెదురుగా పడిపోయారు. అంతా గందరగోళంగా తయారైంది. అక్కడ నేలమీద పడిన న్యాయవాదులు అందరినీ చూస్తుంటే ఆలీసుకి వారం కింద తాను పొరపాటున నేలమీద పడేసిన చేపలకుండీ పగలగా నేలమీద కొట్టుకుంటున్న చేపపిల్లలు గుర్తుకు వచ్చాయి.



"క్షమించాలి," అని వాళ్లందరిని సాధ్యమైనంత తొందరగా ఎత్తటానికి ప్రయత్నించింది ఆలీసు. పగిలిపోయిన చేపలతొట్టి, తొందరగా తీయకపోతే చేపలు చనిపోయే ప్రమాదమే ఆమె మనసులో ఇంకా తిరుగుతున్నాయి.

పరిస్థితులను గమనించిన రాజుగారు "న్యాయవాదులు వారి వారి స్థానాల్లో కూర్చుని స్థిరపడేవరకు ఈ న్యాయవిచారణ ముందుకు సాగదు," అని అన్నారు. ఆలీసు వైపు కోపంగా చూశారు.

న్యాయవాదుల వేదికవైపు చూడగా తన తొందరలో బల్లిని తలకిందులుగా పెట్టినట్లు గుర్తించింది ఆలీసు. పాపం ఆ బల్లి ఏమీ చెయ్యలేక తన తోకను గాలిలో ఊపుతూ తలకిందులుగా నిలుచోవడం గమనించింది ఆలీసు. వెంటనే బల్లిని తీసి, సరిగా కూర్చోపెట్టింది. 'దీని వల్ల పెద్దగా ప్రయోజనం ఏమీ లేదు,' అనుకుంది ఆలీసు, 'బల్లి ఏ వైపున కూర్చున్నా విచారణకు ఏ రకంగానూ తోడ్పడలేదు.'

జరిగినదాని నుంచి న్యాయవాదులందరూ కొంత తేరుకుని తమ తమ స్థానాలలో స్థిరపడిన తరవాత పలకలు, బలపాలు వెతికి ఎవరివి వాళ్లకి ఇచ్చారు. వాళ్లంతా జరిగిన ప్రమాదం గురించి విశదంగా రాయడం మొదలుపెట్టారు. ఒక్క బల్లి మాత్రం హఠాత్తుగా జరిగిన ఆ సంఘటనుండి ఇంకా తేరుకోలేక నోరు తెరచుకుని ఇంటి కప్పువైపు చూస్తూ ఉండిపోయింది.

ఆలీసును ఉద్దేశించి రాజుగారు, "ఈ విషయంలో నీకు ఏమి తెలుసు?" అన్నారు.

"నాకేమీ తెలియదు," అంది ఆలీసు.

"అసలు ఏమీ తెలియదా?" నొక్కి అడిగారు రాజుగారు.

"అసలు తెలియదు," అంది ఆలీసు.

"ఇది ఎంతో ముఖ్యం," న్యాయవాదుల వైపు తిరిగి అన్నారు రాజుగారు. న్యాయవాదులు అది రాసుకోబోతుండగా తెల్ల కుందేలు లేచి "అది అంత ముఖ్యం కాదు," అని అడ్డుపడింది. దాని కంఠం మర్యాద పూర్వకంగానే ఉన్నా ముఖకవళికలు రాజుగారిని వెక్కిరిస్తున్నాయి.

"అవును అంత ముఖ్యం కాదనే నా ఉద్దేశం కూడా," అన్నారు

రాజుగారు. "ఎంతో ముఖ్యం – అంత ముఖ్యం కాదు – ఎంతో ముఖ్యం – అంత ముఖ్యం కాదు..." ఏ పదం బాగా ఉంటుందో తెలుసుకోవటానికన్నట్లు ఆ పదాలను రాజుగారు లోగొంతుకలో వల్లెవేయసాగారు.

న్యాయవాదులకు ఏం చెయ్యాలో, ఏమని రాయాలో తెలియక తికమక పడ్డారు. కొందరు 'ఎంతో ముఖ్యం,' అని మరికొందరు న్యాయవాదులు 'అంత ముఖ్యం కాదు,' అని రాసుకున్నారు. వాళ్లు రాసుకున్నవి చూడగలిగేటంత ఎత్తులో ఉన్న ఆలీసు 'వాళ్లు ఏం రాసినా ఏమీకాదు,' అని తనలోతాను అనుకుంది.

అంతవరకు పుస్తకంలో ఏదో రాసుకుంటున్న రాజుగారు "నిశ్శబ్దం," అంటూ అరిచి తన పుస్తకంలోనుండి ఇలా చదివారు: "నియమం 42 ప్రకారం మైలుకు పైగా పొడవుగా ఉన్న వ్యక్తులందరూ ఈ న్యాయస్థానాన్ని విడిచి వెళ్లాలి." అందరూ ఆలీసు వైపు చూశారు.

"నేను మైలు పొడవు లేను," అని అరిచింది ఆలీసు.

"నువ్వు మైలు పొడవు ఉన్నావు," అన్నారు రాజుగారు.

రాణీగారు వెంటనే "రెండు మైళ్ల పొడవు ఉంది," అన్నారు.

"అయితే అయి ఉండవచ్చు. కానీ నేను మాత్రం ఈ న్యాయస్థానాన్ని విడిచి వెళ్లడంలేదు. ఈ నియమాన్ని మీరు ఇప్పటికిప్పుడు కల్పించారు," అని గట్టిగా అంది ఆలీసు.

"కాదు. ఇది చాలా పాత నియమం," అన్నారు రాజుగారు.

"అలా అయితే అది మొదటి నియమం అయి ఉండాలి," అంది ఆలీసు.

తెల్లబోయిన రాజుగారు తన పుస్తకాన్ని గభాలున మూసేశారు. న్యాయవాదులను ఉద్దేశించి, వణుకుతూ, "అయితే శిక్ష ఏమిటో ఆలోచించండి," అన్నారు.

"ఇంకా చాలా సాక్ష్యాలు ఉన్నాయి మహారాజా! ఈ కాగితం ఇప్పుడే చేరింది," అంది తెల్ల కుందేలు కంగారుగా.

"అందులో ఏముంది," అన్నారు రాణీగారు.

"నేనింకా తెరిచి చూడలేదు. కానీ అది నిందితుడు ఎవరికో రాసిన ఉత్తరంలా ఉంది," అంది కుందేలు.

"అంతే అయి ఉండాలి. అయినా ఎవరికీ ఉద్దేశించకుండా ఉత్తరం రాయరు కదా!" అన్నారు రాజుగారు.

"అయితే ఆ ఉత్తరం ఎవరికి రాశాడు?" న్యాయవాదులలో ఒకరు అడిగారు.

"ఆ ఉత్తరం ఎవరికీ రాసిలేదు!" అంది తెల్ల కుందేలు. "ఉత్తరం పైన ఎవరి పేరూ రాసిలేదు. అసలు అది ఉత్తరమే కాదు. ఇందులో ఒక పాట రాసి ఉంది," ఉత్తరం విప్పుతూ అంది కుందేలు.

"అది ఖైదీ చేతి రాతలాగా ఉందా?" అని ప్రశ్నించాడు మరొక న్యాయవాది.

"లేదు! అదే ఇందులోని అర్థంకాని విషయం," అంది కుందేలు. (న్యాయవాదులందరూ ఆశ్చర్యంగా చూశారు.)

"అయితే ఎవరి చేతి రాతనో 'నకలు' చేసి ఉండాలి," అన్నారు రాజుగారు. (న్యాయవాదుల ముఖాలు మళ్లీ వికసించాయి.)

"క్షమించాలి, నేను రాయలేదు. అది నేను రాసినట్లు ఆధారం లేదు. దాని కింద ఎవరి సంతకమూ లేదు," అన్నాడు ఖైదీగా ఉన్న జాకీ.

"నువ్వు సంతకం చెయ్యలేదు అంటే సరిపోదు. నువ్వు కావాలని సంతకం పెట్టి ఉండవు," అన్నారు రాజుగారు. "నువ్వు నిజాయితీపరుడివి అయితే సంతకం పెట్టి ఉండేవాడివి. ఏదో దురుద్దేశంతోనే సంతకం పెట్టలేదు."

ఆ రోజు చేసిన తీర్మానాల్లో ఈ ఒక్క తీర్మానమే రాజుగారు తన తెలివితేటలను ఉపయోగించి చేశారని అందరూ కరతాళ ధ్వనులు చేశారు.

"అతడు తప్పు చేశాడని నిర్ధారణ అవుతోంది," అన్నారు రాణీగారు.

"అసలు ఉత్తరంలో ఏముందో తెలియకుండా నేరం ఎలా రుజువు అవుతుంది," అంది ఆలీసు.

"అయితే ఉత్తరం చదువు," అన్నారు రాజుగారు, తెల్ల కుందేలును ఉద్దేశించి.

తెల్ల కుందేలు కళ్లజోడు పెట్టుకుని "ఎక్కడ మొదలుపెట్టమంటారు మహారాజా?" అని అడిగింది.

"మొదటినుండి ప్రారంభించి, చివరి వరకు చదివి, అప్పుడు ఆపు," అన్నారు రాజుగారు.

కుందేలు ఇలా చదవసాగింది:

*"ఆమె వద్దకు నువ్వు వెళ్లావని తెలిసింది నాకు,*
*నా గురించి అతడితో ప్రస్తావించావు:*
*మంచి యోగ్యతా పత్రమే ఇచ్చావు నాకు,*
*కాని నాకు ఈతకొట్టటం మాత్రం రాదన్నావు.*

*నేను వెళ్లలేదని అతడు పంపించాడు కబురు*
*(ఇది నిజమని గుర్తించారు అందరు):*
*ఒకవేళ ఆమె పట్టు పట్టిందనుకో,*
*నీ గతి ఏమవుతుందో తెలుసుకో.*
*నేనామెకు ఒకటిచ్చాను, వాళ్లతనికి రెండిచ్చారు,*
*మీరు మాకు మూడో, అంతకంటే ఎక్కువో ఇచ్చారు,*
*అతడినుంచి అవన్నీ మీకు తిరిగొచ్చాయి,*
*కానీ అంతకుముందు అవన్నీ నావేనోయి.*

*ఈ వ్యవహారంలో నీకు, నాకు*
*పాత్ర ఉందని తెలిసిపోయాక,*
*వాళ్లందరినీ నువ్వు విడిచిపెట్టాలి,*
*మునుపటిలా స్వేచ్ఛగా వదిలేయాలి.*

*ఆమెకు అవి నచ్చాయని అతడికి చెప్పకు*
*ఇది మన మధ్య రహస్యం, తెలుసు నాకు, నీకు*
*మూడోకంటికి తెలియనివ్వబోకు*
*ఎంతమాత్రం గుట్టు రట్టు కానివ్వకు.*

*చెప్పమంటావా నా అభిప్రాయం*
*(ఆమెకు మూర్ఛ రాకముందు)*
*అతడికి, మాకు, దానికి మధ్య*
*నువ్వే ఒక పెద్ద అంతరాయం."*

ఈ మాటలను విన్న రాజుగారు "ఇప్పటి వరకు మనం విన్న సాక్ష్యాలలో ఇది చాలా ముఖ్యమైన సాక్ష్యం. ఇప్పుడు న్యాయవాదులు తీర్పు..." అన్నారు రాజుగారు న్యాయవాదులను ఉద్దేశించి.

"ఎవరైనా ఆ ఉత్తరంలో ఉన్నది ఏమిటో చెప్పగలిగితే, నేను వాళ్లకి రూపాయి ఇస్తాను. ఈ ఉత్తరంలో ఇసుమంతైనా అర్థం లేదు," అంది ఆలీసు. (ఆపాటికి ఆలీసు చాలా పెద్దగా పెరిగిపోయి, మధ్యలో అడ్డుపడటానికి ఏమాత్రం భయపడటంలేదు.)

'ఆ ఉత్తరంలో ఏమీ అర్థం లేదన్నది ఆమె అభిప్రాయం,' అని న్యాయవాదులు తమ పలకల మీద రాసుకున్నారు. కానీ దాని అర్థం వివరించటానికి ఎవరూ ప్రయత్నించలేదు.

"ఆ ఉత్తరంలో అర్థం లేకపోతే మరీ మంచిది," అన్నారు రాజుగారు, "దానికోసం వెతికే శ్రమ మనకు తప్పుతుంది." రాజుగారు ఆ ఉత్తరాన్ని తన వడిలో పెట్టుకుని కాసేపు ఒంటికంటితో చూశారు. "ఏదో అర్థం ఉన్నట్టే అనిపిస్తోంది నాకు. '...నాకు ఈత కొట్టటం మాత్రం రాదన్నావు...' నీకు ఈత వచ్చా?" జాకీవైపు తిరిగి అడిగాడు రాజు.

జాకీ విచారంగా తల అడ్డంగా ఊపాడు. "నేను ఈతకొట్టేవాడిలా అనిపిస్తున్నానా?" అన్నాడు. (అట్టముక్కతో చెయ్యబడిన అతడు అలా అనిపించనే అనిపించటం లేదు.)

రాజుగారు మిగిలిన పద్యాన్ని చదువుతూ కూర్చున్నారు. " 'ఇది నిజమని అందరూ గుర్తించారు...' అంటే న్యాయవాదులు అన్నమాట... 'నేనామెకు ఒకటిచ్చాను, వాళ్లతనికి రెండిచ్చారు...' అంటే కాజాలను ఏం చేసిందీ చెబుతున్నాడు..."

“ఆ తరవాత ‘అవన్నీ మీకు తిరిగొచ్చాయి...’ అని కూడా ఉందిగా,” అంది ఆలీసు.

“అదిగో, అవి అక్కడ బల్లమీదే ఉన్నాయిగా,” అన్నారు రాజుగారు విజయగర్వంతో. “ఇంతకంటే స్పష్టత ఏం కావాలి? ‘ఆమెకు మూర్ఛ రాకముందు...’ నీకు ఎప్పుడూ మూర్ఛ రాలేదన్నావు కదా!” అన్నారు రాజుగారు రాణీగారి వైపు చూస్తూ!

“లేదు,” అన్నారు రాణీగారు కోపంగా, ఒక సిరాబుడ్డిని బల్లిమీదకు విసురుతూ. (వేలితో పలకమీద రాయటం వల్ల ఏమీ పడటంలేదని తెలిసి రాయటం మానేసింది బల్లి. ఇప్పుడు అతని ముఖం మీద నుంచి కారుతున్న సిరాలో వేలును ముంచి రాయసాగింది.)



“అయితే ఈ చరణాలు నీకు వర్తించవు,” అన్నారు రాజుగారు చిరునవ్వుతో సభా ప్రాంగణాన్ని కలయజూస్తూ. ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

“అది పదాల గారడీ,” అన్నారు రాజుగారు కోపంగా! అందరూ నవ్వారు.

"ఇక న్యాయవాదులు తీర్పు చెప్పవచ్చు," అన్నారు రాజుగారు. రాజుగారు అలా అనటం అది ఏ ఇరవయ్యోసారో అయి ఉంటుంది.

"కాదు కాదు ముందు శిక్ష ఏమిటో నిర్ణయించిన తరవాత తీర్పు," అన్నారు రాణీగారు.

"ముందు శిక్ష నిర్ణయిస్తారట, ఏం చిత్రం!" పెద్దగా అంది ఆలీసు.

"నోరు మూసుకో!" కందగడ్డలాగా మారిన ముఖంతో అరిచారు రాణీగారు.

"నేను ఊరుకోను!" అంది ఆలీసు.

"ఆ అమ్మాయి తల తీయించెయ్యండి," అని పెద్దగా అరిచారు రాణీగారు. ఎవ్వరూ కదలలేదు.



"నువ్వంటే నాకు భయమేమీ లేదు," అంది ఆలీసు. అప్పటికి ఆలీసు తన మామూలు ఎత్తుకు పెరిగిపోయింది. "మీరంతా వట్టి పేకముక్కలు!"

దాంతో పేక దస్తా అంతా గాలిలోకి ఎగురుతూ ఆలీసు మీద పడసాగాయి. ఆలీసు సగం భయంతో, సగం కోపంతో అరిచి, ఆ పేకముక్కలను చేతులతో వెనక్కి కొట్టసాగింది. తను చెరువు ఒడ్డున అక్క ఒళ్లో తలపెట్టి నిద్రపోతోందని, తన మీద పడిన ఎండుటాకులను అక్క తీసేస్తోందని ఆలీసు గుర్తించింది.

"లే! ఆలీసు. చాలాసేపు నిద్రపోయావు," అంది ఆలీసు అక్క.

"ఆ! నాకు భలే కల వచ్చింది," అంటూ, తనకు జ్ఞాపకమున్నంతవరకు తన కలను వివరించి చెప్పింది ఆలీసు. "అవును! చాలా వింతైన కలే. భోజనానికి ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది, పద," అంది అక్కయ్య. పరిగెడుతూ వెళుతున్న ఆలీసు తమాషా కల గురించే ఆలోచించసాగింది అక్క.

---

ఆమె అక్కమాత్రం అక్కడే ఉండిపోయింది. కుంగుతున్న సూర్యుడిని చేతిపై తల ఆన్చి చూస్తూ కూర్చుంది. ఆలీసు గురించి, ఆమె అద్భుత సాహసాల గురించి ఆలోచిస్తోంది. ఆలోచిస్తూ, ఆలోచిస్తూ ఆమె కూడా కలగనసాగింది. ఆమె కల ఇలా ఉంది:

మొదట ఆమె ఆలీసు గురించి కలగంది. తన మోకాళ్లపై చిట్టిచేతులు వేసి మెరిసే కళ్లతో తన కళ్లల్లోకి చూస్తోంది. కళ్లల్లోకి పడుతున్న కురులను వెనక్కి తోసుకోటానికి ఆమె తల ఎగరెయ్యటం కనపడుతోంది, ఆమె మాటలు వినపడుతున్నాయి. ఆమె మాటలు వింటూ ఉండగానే చెల్లెలి కలలోని వింత వింత జంతువులన్నీ కనపడసాగాయి.

తెల్ల కుందేలు పరుగున వెళ్లటంతో ఆమె కాళ్ల దగ్గరి పొడవాటి గడ్డి జరజరలాడింది – భయపడిన ఎలుక పక్కనున్న మడుగులో ఈదుకుంటూ వెళుతోంది – మార్చి కుందేలు, అతడి మిత్రుల అంతంలేని విందు దగ్గర

టీకప్పుల గలగలలు వినవస్తున్నాయి, తలలు నరకమంటూ రాణీగారు వేస్తున్న కేకలు కూడా వినిపిస్తున్నాయి – యువరాణి ఒడిలోని పందిలాంటి పిల్లవాడు తుమ్ముతూ ఉండగా, ఆమె చుట్టూ వంట పాత్రలు శబ్దాలు చేస్తూ పడుతున్నాయి – గ్రైఫన్ అరుపులు, బల్లి పలకపై బలపంతో రాస్తున్నప్పుడు చేసే కిర్రు కిర్రు శబ్దం, అణిచివేయబడిన గినీ పందులకు ఊపిరాడక పోవటం వంటివి గాలిలో నిండిపోయాయి. దూరంగా నకిలీ తాబేలు ఏడ్పులు కూడా వినపడుతున్నాయి.

తాను అద్భుత లోకంలో ఉన్నట్టు కళ్లు మూసుకుని ఊహించుకుంటున్న ఆలీసు అక్కకి తాను కళ్లు తెరవాలనీ, ఆ అద్భుతాలన్నీ రోజువారీ వాస్తవాలు అవుతాయని ఆమెకు తెలుసు. గడ్డి గాలికి జరజరలాడుతోంది, రెల్లుగడ్డి కదలికల వల్ల మడుగులో అలలు ఏర్పడతాయి – టీ కప్పుల గలగలలు గొర్రె మెడలో గంటలుగా మారతాయి, రాణీగారి అరుపులు గొర్రెల కాపరి అరుపులుగా మారతాయి – పిల్లవాడి తుమ్ములు, గ్రైఫన్ అరుపులు, మిగిలిన వింత శబ్దాలన్నీ పెరటిలోని శబ్దాలుగా మారతాయని ఆమెకు తెలుసు. దూరంగా వినపడే నకిలీ తాబేలు ఏడుపు కాస్తా ఆవుల అరుపులాగా మారుతుంది.

ఆ తరవాత తన చిన్నారి చెల్లి కొంతకాలానికి పెరిగి పెద్దదవుతుందని, ఎంత వయస్సు పైబడినప్పటికీ ప్రేమించే తన పసిహృదయాన్ని మాత్రం కోల్పోదని ఆమె అనుకోసాగింది. తన చుట్టూ ఉన్న చిన్న పిల్లలకు వింత వింత కథలు, తాను చాలా సంవత్సరాల క్రితం కన్న అద్భుత లోకం కల చెబుతూ వాళ్ల కళ్లల్లో కాంతినీ, కుతూహలాన్ని నింపుతుందని ఆమెకి తెలుసు. తన బాల్యాన్నీ, సంతోషభరితమైన వేసవి రోజులను గుర్తు చేసుకుంటూ పిల్లల్లో పిల్లలాగా వాళ్ల సంతోషాలకు నవ్వుతూ, కష్టాలకు ఏడుస్తూ ఆనందంగా ఉంటుంది ఆలీసు.

ప్రపంచ బాల సాహిత్యంలో ఎన్నదగిన పుస్తకాలలో 'అద్భుత లోకంలో ఆలీసు' ఒకటి. లూయిస్ కారోల్ 'Alice's Adventures in Wonderland' ని 1865లో రాశాడు. ఇది ప్రచురితమైన 150 సంవత్సరాల సంబరాల సందర్భంగా దీని తెలుగు అనువాదాన్ని ప్రచురిస్తున్నాం. ఇప్పటివరకు ఇది 150కి పైగా భాషలలోకి అనువాదమయ్యింది. భారత దేశంలో హిందీ, మరాఠీ, కొంకణి, కన్నడ, ఒడియా, బెంగాలి, మలయాళం, అస్సామీ, ఉర్దూ, తమిళం, పంజాబీ భాషలలోకి అనువాదమయ్యింది.

లూయిస్ కారోల్ అసలు పేరు చార్లెస్ లట్‌విడ్జ్ డాడ్సన్. పదకొండుమంది సంతానంలో అతను పెద్దవాడు. కుటుంబ వినోదం కోసం చిన్నతనంలోనే సొంతంగా పత్రికలను తయారు చేసేవాడు. తను చదువుకున్న కళాశాలలోనే గణిత ఉపన్యాసకుడిగా 1855 నుంచి 1881 వరకు పనిచేశాడు. అతడు సిగ్గరే కాకుండా నత్తికూడా ఉండేది. పిల్లలకు కథలు చెప్పడం అంటే ఎంతో ఇష్టం. ఆలీసు కథానాయికగా 'Through the Looking Glass' అన్న మరో పుస్తకాన్ని 1872లో రాశాడు. ఇవేకాక లూయిస్ మరికొన్ని పుస్తకాలు రాశాడు. అతడు మంచి ఫోటోగ్రాఫర్ కూడా. ఈ పుస్తకానికి సర్ జాన్ టెన్నియల్ వేసిన బొమ్మలు ఎంతో ఆకట్టుకున్నాయి. ఈ కథని నాటకంగానూ, సినిమాగానూ కూడా మలిచారు. ఈ పుస్తకం ఆనాటికీ, ఈనాటికీ ఆబాలగోపాలాన్ని అలరిస్తూనే ఉంది.



*చిత్రకారుడు*

***సర్ జాన్ టెన్నియల్***

*(1820-1914)*



*రచయిత*

***లూయిస్ కారోల్***

*(1832-98)*



మంచి పుస్తకం

ISBN 978-93-80153-93-3

